ప్రపంచ తెలుగు మహాసభ సందర్భంగా ప్రచురణ :



# "మన వాస్తు సంపద"

రచయిత :
శ్రీ గడియారం రామకృష్ణ శర్మ



ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమీ
కళాభవనం, సైఫాబాద్,
హైదరాబాద్-500004

# ముందుమాట

ఎన్నో ఏళ్లుగా అనుకొంటున్న ప్రపంచ తెలుగుమహాసభలు జరుగనున్న పర్వ సమయం ఆసన్నమవుతున్నది. ప్రపంచంలోని తెలుగువారి ప్రతినిధు లందరిని ఒకచోట సమీకరించవలెనని పెద్దలందరూ కన్నకలలు ఫలిస్తున్న శుభ సమయమిది. రాబోయే ఉగాది రెండువేల అయిదువందల సంవత్సరాల తెలుగు జాతి చరిత్రలో మరపురాని మధుర ఘట్టము కాగలదు.

క్రీస్తుపూర్వం మూడవ శతాబ్దికిచెందిన శాతవాహన రాజుల కాలంనుండి తెలుగు ప్రజలకు ఒక విశిష్టమైన చరిత్ర ఉన్నది. భారతదేశంలో తెలుగు మాట్లాడే ప్రజలు దాదాపు ఐదుకోట్లకు పైగా ఉన్నారు. హిందీ మాట్లాడేవారి తరువాతి స్థానం తెలుగువారిదే. బౌద్ధపూర్వయుగంనుంచి ఇటీవల బ్రిటిష్ సామ్రాజ్య పరిపాలనాయుగం వరకూ తెలుగువారు పెద్దఎత్తున ప్రపంచం నలు మూలలకూ వలస వెళ్లడం జరిగింది. అట్లా వెళ్ళిన తెలుగువారు తమ భాషా సంస్కృతి సంప్రదాయాలను ఆయా జాతీయ జీవన విధానాలతో మేళవించి, వాటిని సుసంపన్నం చేస్తూఉన్నారు.

ప్రపంచ తెలుగు మహాసభల ప్రధాన లక్ష్యం తెలుగు ప్రజల, తెలుగు అభిమానుల ప్రతినిధులను ఒక వేదికమీద సమావేశపర్చడం. జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక రంగాలలో తెలుగువారు చేయవలసిన కృషినిగూర్చి చర్చించి, నిర్ణయించుకోవడానికి, తద్వారా వివిధ చైతన్యస్రవంతులను ఏకోన్ము ఖంచేసి మన సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేసుకోవడానికి ఈ మహా సభలు దోహదకారులు అవుతవి. అంతేకాక ఈ మహాసభలు అర్థ్రమైన భావ సమైక్యతకు ప్రాతిపదికలై తెలుగు జాతిని సమైక్యం చేయగలవనీ, ఆవిధంగా జాతీయ అభ్యుదయానికి తోడ్పడగలవనీ విశ్వసిస్తున్నాను.

1975 ఏప్రిల్ 12వ తేదీన తెలుగు ఉగాది రోజున ప్రారంభమై ఒక వారం రోజులుపాటు జరిగే ఈ మహాసభలలో వివిధ దేశాలనుంచీ, వివిధ రాష్ట్రాలనుంచీ, యునెస్కో వంటి అంతర్జాతీయ సంస్థలనుంచి విచ్చేసి ప్రముఖులు ప్రతినిధులుగానో, పరిశీలకులుగానో పాల్గొంటారు. ఈ మహాసభల సమయంలో

చర్చాగోష్ఠులు, ప్రదర్శనలు, ప్రచురణలు మొదలైన కార్యక్రమాలు జరుగుతాయి. దేశ విదేశాలలోని తెలుగువారి సంస్కృతి, తెలుగు భాషా సాహిత్యాల కళల అభివృద్ధి వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి మొదలైన విషయాలపై చర్చాగోష్ఠులు జరుగుతవి. తెలుగువారి సాంస్కృతిక వైభవాన్ని వివిధ కోణాలనుంచి ప్రస్ఫుటంచేసే ఒక ప్రదర్శన ఏర్పాటు అవుతున్నది. తెలుగువారి సమగ్ర స్వరూపాన్ని సందర్శించడానికి వీలైన సంగ్రహాలయాన్ని (మ్యూజియంను) స్థాపించడానికి ఈ ప్రదర్శన బీజ భూతమవుతుంది. తెలుగువారి సంస్కృతిని నిరూపించే సాంస్కృతిక కార్యక్రమాలు వారం రోజులపాటు సాగుతవి. తెలుగు ప్రజల సంస్కృతి సంప్రదాయాలను విశదంచేసే ప్రత్యేక సంచికలు తెలుగు, ఇంగ్లీషు, హిందీ ఉర్దు భాషలలో విడుదల అవుతాయి. ఈ కార్యక్రమాలలో భాగమే ఈ గ్రంథ ప్రచురణ.

తెలుగు ప్రజలు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు మొదలైన వివిధ రంగాలలో సాధించిన ఘనవిజయాలను విశదంచేసే గ్రంథాలు అనేకం ఈ మహాసభల సమయంలో విడుదల అవుతాయి. ఈ గ్రంథాలను రచించి, సకాలంలో మాకు అందించిన రచయితలందరకూ నా కృతజ్ఞతలు. ఈ గ్రంథాలను ప్రచురించే భారం వహించడానికి ముందుకు వచ్చిన అకాడమీ అధినేతలను అభినందిస్తున్నాను. తెలుగువారి విశిష్టతలను విశదంచేసే ఈ గ్రంథాలు సహృదయు లందరి ఆదరణ పొందగలవని విశ్వసిస్తున్నాను. అయితే, ఇంత మాత్రం చేతనే ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలు సఫలం కాగలవని నేను అనుకోవడంలేదు. చేయవలసినది ఇంకా ఎంతో ఉంది. ఈ మహాసభల సందర్భంగా నెలకొల్పబడనున్న "అంతర్జాతీయ తెలుగు విజ్ఞాన సంస్థ" మహాసభల ఆశయ సాధనకు పూనుకొనడమే కాక జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేయగలదని నమ్ముతున్నాను.

జలగం వెంగళరావు

అధ్యక్షులు

ప్రపంచ తెలుగు మహాసభలు

# పరిచయము

సహస్రాబ్దాలుగా ప్రవర్ధమానమగుచున్న తెలుగు సంస్కృతిని తెలుగుదేశపు నలుచెరగుల పరిచితము చేయు సంకల్పములో 1975 వ సంవత్సరమును తెలుగు సాంస్కృతిక సంవత్సరముగ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముప్రకటించినది. అందుకు అనుగుణమైన కార్యక్రమాలను నిర్వహింపజేయుటయేగాక, ప్రపంచములోని వివిధదేశాలలో వసించు చున్న తెలుగువారి సాంస్కృతిక ప్రతినిధులందరును ఒకచోట సమా వేశమగు వసతిని కల్పించుటకై 1975, ఏప్రిల్ 12 (తెలుగు ఉగాది) మొదలుగ ప్రపంచ తెలుగు మహాసభ హైదరాబాదున జరుగునటుల ప్రభుత్వము నిర్ణయించినది. అందుకు ఒక ఆహ్వానసంఘము ఏర్పా టయినది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రి మాన్యశ్రీ జలగం వెంగళరావుగారు ఆ సంఘమునకు అధ్యక్షులు; విద్యాశాఖామంత్రి మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు దాని కార్య నిర్వాహ కాధ్యక్షులు: ఆర్థికమంత్రి మాన్యశ్రీ పిడతల రంగారెడ్డిగారు ఆర్థిక, సంస్థా కార్యక్రమాల సమన్వయ సంఘాల అధ్యక్షులు.

ఆ సంఘము, ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున వచ్చు వారికి తెలుగుజాతి సాంస్కృతిక వైభవమును తెలియజేయుటకు అనువుగ ఆంధ్రభాషా సాహిత్య, కళా చరిత్రాదికములను గురించి ఉత్తమములు, ప్రామాణికములునగు కొన్ని లఘు గ్రంథములను ప్రకటించవలెనని సంకల్పించి, ఆ కార్యనిర్వహణకై 44 మంది సభ్యులు కల ఒక విద్వత్ సంఘమును, నియమించినది. ఆ విద్వత్ సంఘము ఆ లఘు గ్రంథముల వస్తువుల నిర్దేశించి వాని రచనకై ఆయా రంగములందు పేరుగనిన ప్రముఖులను రచయితలుగ యెన్ను

కొనినది. ఈవిధముగ సిద్ధమైన గ్రంథములలో వాస్తు, శిల్ప, చిత్రకళలకు సంబంధించిన వానిని ప్రకటించు బాధ్యతను ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమీ వహింప వలసినదిగ ప్రపంచ తెలుగు మహాసభా కార్యనిర్వాహకాధ్యక్షులు మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు అకాడమీని కోరిరి. మహాసభా సఫలతకొరకై కృషి చేయు సంకల్పముతో ఈ బాధ్యతను వహించుటకు అకాడమీ సంతోషముతో అంగీకరించినది.

ఆ విధముగ ప్రకటింపబడిన గ్రంథశ్రేణిలో ఈ "మనవాస్తు సంపద" అను గ్రంథమును, రచించిన శ్రీ గడియారం రామకృష్ణ శర్మగారు ఆంధ్ర పాఠకలోకమునకు సుపరిచితులు. వారికి మేముకృతజ్ఞతా బద్ధులము, గ్రంథమును నిర్దుష్టముగ, చక్కగాముద్రించిన లలితా ప్రెస్ వారికి మా కృతజ్ఞత.

హైదరాబాదు,
తేది. 8-4-75

నూకల నరోత్తమరెడ్డి
అధ్యక్షుడు
*ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమి*

—:(o):—

# ముందు మాటలు

తెలుగువారికి చాల ప్రియమైన ఉగాదిపండుగనాడు ప్రపంచ తెలుగు మహాసభలు జరుగనున్నవి. ఆ సందర్భములో ఆంధ్రుల సర్వతోముఖ సంస్కృతి వికాసమును తెలుపు వివిధ విషయిక గ్రంథములు ఆవిష్కరింప బడుచుండుట, ఆపరంపరలో 'మనవాస్తు సంపద'ను గూర్చి వ్రాయు అవకాశము నాకులభించుట ముదావహములు ఇందుకు తగిన శక్తిలేకున్నను ఉత్సాహము నన్ను ప్రేరేచినది. "మణౌ వజ్రసముత్కీర్ణే సూత్రస్యేవాస్తి మేగతిః" అన్న కవికులగురుని సూక్తి నాపట్ల అన్వర్థకము.

ఒకనాడు ఆంధ్రులు సకల భారతమున వాసి గాంచినవారు. వారి కళాకృతులు నేటికిని అన్యరాష్ట్రములలో మిగిలియున్నవి. నేటి రాజకీయ విభాగము ననుసరించి ఆంధ్రప్రాంతమునందలి నిర్మాణములనే దృష్టియందుంచికొని పరిచయము చేయప్రయత్నించితిని.

ప్రపంచ సంస్కృతులలో భారతీయ సంస్కృతి ఉదారమైనది. విదేశీయ జనాంగములు, సంస్కృతులు, భరతఖండమున కొన్ని ప్రాంతములలో తమ ప్రభావమును చూపినను మనప్రాచీన సంస్కృతి దానిని జీర్ణముచేసికొని తన రూపము నిచ్చి తన అంగముగ చేసికొన్నది. ఇందుకు ముఖ్యకారణము భారతీయ ఆధ్యాత్మిక దృష్టి. భారతీయ సంస్కృతిలో ఆధ్యాత్మిక వివేచనకు ప్రాశస్త్యమున్నను ధర్మవిరుద్ధములుకాని కామ—కర్మాచరణ-అర్థసంపాదన—ప్రాపంచిక సుఖములుగూడ వ్యక్తి సంపూర్ణవికాసమునకు ఆవశ్యకములని నిర్ణయించబడినందున 'భారతీయులు కేవల ఆముష్మిక దృష్టిగలవారు' అను ఆపాదనము నిరాధారమైనది.

అఖండము, అనాది అయిన భారతీయ సంస్కృతిలో ఆంధ్ర సంస్కృతి ఒక అంశము ఈ సంస్కృతిలో 'వాస్తువు' ఒకభాగము. వాస్తువనుపదము విశాలార్థకమైనను శాశ్వత నిర్మాణములైన దేవమందిరములనే గ్రహించితిని. మన సంస్కృతికి దేవాలయమే కేంద్రము. సర్వకళలు శాస్త్రములు దేవాలయమును

బ్రహ్మాండమునకు ప్రతీకగా రచించుటకు తోడ్పడుచున్నవి. దేవాలయ 'సమగ్ర రచన వాస్తుపురుషాకృతి మీద నిలిచియున్నది'.

మన దేవాలయ విగ్రహారాధనలను గూర్చి కొందరు దేశీయ విదేశీయ పండితులు అజ్ఞాన విలసితములైన వ్రాతలను వ్రాసినారు. అందుకై మనవాస్తు విజ్ఞానమును కొంత పరిచయము చేసితిని. మనదేశమునందలి వివిధవాస్తు పద్ధతులను సంగ్రహముగ వివరించి లక్ష్యములుగ కొన్ని నిర్మాణములను సూచించితిని సమయ-స్థలసంకోచములతో వ్రాయఁబడిన ఈ లఘుపుస్తకము ఆంధ్రలోకమునకు ఆదరణీయమైనచో కృతార్థుడ నయ్యెదను.

ఈ రచనలో ఎందరో విద్వాంసులు, కళావేత్తలు వ్రాసిన రచనలు చాల ఉపకరించినవి. వారందరికిని కృతజ్ఞుడను. ఇందలి సుగుణములన్నియు వారివనియు. దోషములు మాత్రము నావనియు విన్నవించికొనుచున్నాను. నాకీ ఆమూల్యావకాశము నొసగిన పెద్దలకు ధన్యవాదములు.

అలంపురము
*20-2-1975*

గడియారం రామకృష్ణ శర్మ



# విషయసూచిక



—:(౦):—

# "మన వాస్తుసంపద"

## ౧. ఉపక్రమణిక

### 1

భారతీయుల వాస్తుశిల్పము 'కళ'గా పరిగణింపబడినది. కళ అనగా అంశము. 'క' కారము బ్రహ్మవాచకమగుటవలన సృష్టిని, 'ల'కారము లయమును సూచించుచున్నందున కళగూడా సృష్టి స్థితి సంహారరూపమైనది. అక్షరమాలయందలి వ్యంజనాక్షరములకు మొదట 'క'కారము, చివర 'ల'కారము అగుటవలవలనను స్వరములు ప్రాణ స్వరూపము లగుటవలనను క, ల, అను అక్షరములలో లలితా త్రిపుర సుందరీ స్వరూపము నిర్దిష్టమైయున్నది.[1] శ్రీ విద్యోపాసనా బహి ర్యాగక్రమమందు చంద్రమండల షోడశకళలను ఉపాసించునపుడు ముఖ్యమైన 'సాదాఖ్యకల' యే త్రిపురసుందరీ స్వరూపము. ఈ పదు నారు కళలనుండియే చతుష్షికళలు అక్షరములు పుట్టినవి. కావున శ్రీవిద్యాస్వరూపమైన వేదమే సర్వకళలకును మూలము.

భారతీయ సంప్రదాయము ప్రకారము కళలు అరువదినాల్గు, బౌద్ధ, జైన, పురాణ, కామసూత్రాది వాఙ్మయము లందు ఈ కళ లను గూర్చి విస్తరముగా తెలుపబడినది. భాగవతమున కళల సంఖ్య అరువదినాల్గు. కాని వాని వివరములు లేవు. భాగవత వ్యాఖ్యాత లలో విశ్వనాథ చక్రవర్తి, శ్రీధరస్వామి, వల్లభాచార్యులు మాత్రము అరువదినాల్గు కళల నామములను పేర్కొనకపోయినను

1. ప్రపంచ సారము:— శ్రీ శంకరభగవత్పాదులు

ఇవి 'శివతంత్రము'న వివరింపబడినవని తెల్పినారు సుఖదేవుడను మరొక వ్యాఖ్యాత కళలను దెల్పు 'విద్యాసంగ్రహ నిబంధము'ను ప్రస్తావించినాడు. ఇంతకంటే మనకు పురాణములనుండి ఎక్కువ తెలియుటలేదు.

బౌద్ధవాఙ్మయము నందలి 'లలితవిస్తరము'న ఎనభై ఆరు (86) కళలు చెప్పబడినవి. కాని అందు వాస్తువిద్య లేదు జైన గ్రంథమగు 'ప్రబంధకోశము' నందు 72 కళలు చెప్పబడినవి. అందు 35వ కళ 'ప్రాసాదలక్షణము'.

'శుక్రనీతిసారము' నందు 64 కళలు వాని పద్ధతులు వివరింపబడినవి. వానిలో 27వ కళ 'తటాక వాసీప్రాసాద సమభూమిక్రియా'. 'వాత్స్యాయన కామ సూత్రము'లలో ప్రథమాధి కరణమునందు స్త్రీ పురుషు లభ్యసింపదగిన చతుష్షష్టి కళలు, మరికొన్ని ఉపకళలు విశదీకరింపబడినవి. వానిలో 38వ కళ 'వాస్తు విద్యా'. కామసూత్ర వ్యాఖ్యాత యశోధరుఁడు తన వ్యాఖ్యలో 64 మూల కళలనియు, వానిని సూక్ష్మ విభాగములు చేసినచో 518 కళ లగుననియు చెప్పినాడు.*

ప్రాచీన భరత ఖండమున 64 కళలతోబాటు 32 విద్యలును, ప్రతివాడు విధిగా అభ్యసింపవలసియుండెను. ఈ 32 విద్యలలో 'శిల్పశాస్త్రము' గూడా కలదు ఈ శాస్త్రములలో ఆ యా విషయములకు సంబంధించిన లక్షణములు నిర్వచింపబడినవి. ఇవన్నియు భారతీయుల సర్వతోముఖ ప్రజ్ఞావిశేషమును తెలుపును.

## 2

భారతీయ వాస్తు విజ్ఞానమును ఆధునిక ప్రపంచమునకు పరిచయము చేయుటకై తగిన కృషి జరుగలేదు. పాశ్చాత్య వాస్తు

* "ప్రాచీన భారత్ కే కలాత్మక్ వినోద్" శ్రీహజారీప్రసాద్ ద్వివేది.

శాస్త్రము నభ్యసించిన దేశీయ విదేశీయ పండితులు భారతీయ నిర్మాణములను చూచి వెరగందుచుండిరే గాని, వానిని గూర్చి క్షుణ్ణముగా తెలిసికొనుటకు ప్రయత్నింపలేదు. మన వాస్తువిశేషములను గ్రహించుటకు కృషిచేసిన పాశ్చాత్యులలో కొందరు సహృదయులు లేకపోలేదు. 'బి. ఆర్. హెరింగ్టన్' అను సివిల్ ఇంజనీరు తన వాస్తు గ్రంథమునకు ముందు మాట వ్రాయుచు "భారత దేశమునకు వచ్చి పోవుచున్న వేలకొలది పాశ్చాత్యులలో ఏ ఒకరిద్దరైన భారతీయ వాస్తు శిల్పకళా విశిష్టతను భారతీయ సౌందర్యోపాసనను గ్రహించిన వారు కలరో లేరో చెప్పజాలము" [2] అని సత్యమును చాటినాడు. 'ప్రొఫెసర్ ఫ్లెచర్' "ప్రాచ్యకళ మా దృక్పథమును విశాలమొనర్చుచున్నది. కాని అందలి సూక్ష్మతర నవీన శైలులు మాకు అంతుచిక్కుటం లేదు. భారతేతరములైన ఏ కళలోనూ ఇంత మహోన్నత కళా కౌశల్యమును మేము చూడలేదు" [3] అని వ్రాసినాడు. వీరివలెనే "సర్ జార్జ్ బర్డువుడ్-జనరల్ కన్నింగ్ హామ్-బర్గెస్-జేమ్సుఫర్ గ్యుసన్ - ఇ. బి. హావెల్ "మొదలైన మేధావులు మన వాస్తుశిల్పముల ఔన్నత్యమును ప్రపంచమునకు వెల్లడించినారు.

అగాధమైన భారతీయ వాస్తుశాస్త్ర మహాసాగరమున మునిగి అనర్ఘమణులను వెలికి దీయవలసియున్నది. అనంత అంధకార కాల గర్భమున దాగియున్న ప్రాచీన వాస్తు విజ్ఞానమును దర్శించుటకు జ్ఞానజ్యోతుల వలె వైదిక సాహిత్యము, పురాణాగమ శిల్పశాస్త్రము లింకనూ మిగిలియున్నవి నష్టావశిష్టములై యున్న మహా నిర్మాణములు మన కళా విశిష్టతను ఎలుగెత్తి చాటుచున్నవి. మన వాస్తు విజ్ఞానము ఉత్కృష్టమైనది : ఉదాత్తమైనది. మన ఆధ్యాత్మ వికాసమునకు అనుగుణముగా ఆ యా ప్రయోజనములతోకూడిన ఆరాధ

---

2. Ancient Indian Architecture.
3. The History of Comparative Architecture.

నలు, ఉపాసనలు, దేవతలు, దేవాగారములు వెలసినవి. ప్రపంచ వాఙ్మయమున ప్రాచీనతమములగు వేదోపనిషత్తులలో దేవమూర్తులు, దేవాయతనములు, అర్చావిధులు ప్రస్తావింపబడినవి. పాశ్చాత్యులును, వారి అనుచరులగు దేశీయ పండితులును నేటికిని సంకుచిత దృష్టిని వీడకున్నారు. వారు సూచించుచున్న అతి ప్రాచీన కాలము కలియుగారంభము దప్ప అన్యము గాదు. అజ్ఞానచ్ఛన్నులైనవారి కన్నులను తెరిపించుటకై చాల కృషి చేయవలసియున్నది

## 3

మన వాస్తువు అనేక విధములైనది. అందులో దేవాలయ వాస్తువు చాల ముఖ్యమైనది. దేవాలయములు మన సంస్కృతికి ప్రధాన కేంద్రములు. 'సంస్కృతి' అను పదముయొక్క అర్థవ్యాప్తి విస్తారమైనది. ఒక మాటలో ఒక వాక్యములో దాని దిగ్దర్శనము చేయించుట కష్టము. అయినను మనుష్యచేతనము యొక్క సంపూర్ణ వికాసమానమైన 'ఆత్మశ్రీ'ని 'సంస్కృతి' అనవచ్చును. భారతీయ సంస్కృతి జీవనాడి నిగమాగమాదులలో తొలిసారిగా స్పందితమైనది. తనలోని ఈశ్వర చైతన్యమును, దాని సర్వతోముఖ వ్యాప్తిని మానవుడు పరిపూర్ణముగ గ్రహించి ఆ చైతన్య ప్రసారణము నందు నిరతుఁడగుటయే 'సంస్కృతి'. దాని ఫలితమే దివ్యకళా సంశోభిత మైన ఆలయ నిర్మాణము.

భారతీయ జీవనమున సకల వికాసములందును ఆధ్యాత్మిక భావము పాలలో నీరువలె కలసియున్నది. మన లలితకళలు గూడా ఈ నియమమునకు దూరము కాలేదు. మనస్సునకు శాంతిస్థితిని ప్రసాదించి, రసానుభవమునకు మూలమైన దివ్యసత్య దర్శనము చేయించుటయే మన కళల ముఖ్యలక్ష్యము. అందువలననే మన వాస్తు-శిల్ప-చిత్రకళా-సంగీత-నృత్య-కవిత్వాదులు భారతీయ ఆధ్యాత్మిక జీవ

నమునకు బహిర్ముఖములై యున్నవని నిస్సంకోచముగా చెప్ప వచ్చును.

ఆధ్యాత్మిక జీవనమునకు భారతీయులొసగిన ప్రాధాన్యమును పాశ్చాత్యులొసగలేదు. ప్రాచ్యపాశ్చాత్య దృక్పథములలోనే విశేష భేదమున్నది. పాశ్చాత్య శిల్పము వారి సామాజిక రాజకీయ జాతీయ జీవనమునకు ప్రతీకగా నున్నట్లే భారతీయ శిల్పము మనసమ్యగ్జీవనము నకు ప్రతీకగా నున్నది. పాశ్చాత్య శిల్పి రాజవైభవముల ననుభవించు విలాస పురుషుడు కాగా భారతీయ శిల్పి జనసామాన్య ప్రతినిధి అయి ధర్మప్రసారణమునకు జీవితము నంకిత మొనర్చిన భక్తుడు-విరక్తుడు అయి ఉన్నాడు.

కళానిర్వచనమున గూడా వారికిని మనకును విభేదము కలదు. "కళ అనగా ప్రకృతికి ప్రతీక ; సమకాలిక పరిస్థితులకు ప్రతిబింబము అయిఉండవలెను." అని పాశ్చాత్యులందురు. భారతీయులు దీనితో తృప్తిచెందరు, "జీవనమును ఆనందప్రదము చేయునది, చిత్తక్షోభ మును పోకార్చి పరమశాంతిని కూర్చునది, మానవునకు స్వస్వరూప జ్ఞానమును కలిగించునది, జీవమును కలుషిత మొనర్చు కామక్రోధాది షడ్వర్గముల ఔద్ధత్యమును అడచునది కళ." అని మనవారు ఉద్ఘా టించినారు. మన కళాకోవిదులు కేవల అనుకరణ ప్రియులుగాక చేతోహారి జీవనసృష్టికర్తలు. సమ్యగ్జీవనవ్యాఖ్యాతలు అయినారు. భారతీయ జీవనమునందు కళాకారుడు కేవలబింబగ్రాహికాడు. అతడు దార్శనికుడు, ఉపాసకుడు, ఆచార్యుడు అయి ఉన్నాడు.



# ౨. భారతీయ వాస్తు కళావైభవము

## 1

ప్రాచీనత:- వేదవాఙ్మయమున వాస్తులక్షణములు చెప్పబడకున్నను ఆకాలమునాటి నిర్మాణములు పరికరములు ప్రస్తావింపబడినవి. వీనివలన ఆ ప్రాచీన యుగమున వాస్తుకళాపరిజ్ఞానము సంపూర్ణముగ నుండెనని తెలిసికొనవచ్చును.

వేదకాలమున జనులు గుహాలలో వసింపక చక్కని ఇండ్లలో నివసించుచుండిరని అథర్వణ వేదమునందు కలదు. ఈ వేదమునందలి మంత్రములందు (9-3-15) విభిన్నాకృతులుగల గృహములు పేర్కొనబడినవి. అప్పుడు గృహము ఆస్తిగా పరిగణింపబడుచుండెను. రాజులకు "ప్రాసాదములు" రాజోద్యోగులకు 'హార్మ్యములు-శాలలు' ఉండినవి. మనము సామాన్యముగా ఇండ్లకు వాడుకొను వస్తువులు పేర్కొనబడినవి. కర్ర స్తంభములకు "ఉపమిత్", దూలములకు "ప్రతిమిత్", దంతెలకు "పరిమిత్" శబ్దములు ఉపయోగింపబడినవి, కొన్నిచోట్ల ప్రధాన స్తంభములకు స్థూణ, పగులచీల్చిన వెదురునకు "అక్షు", పైకప్పునకు వేయు గడ్డికి "ఛాదిస్" అను ప్రయోగములు కూడా కానవచ్చు చున్నవి. తైత్తరీయ బ్రాహ్మణమునందలి మంత్రములలో సామవేదమంత్రములలో బ్రాహ్మణ గృహ వర్ణన కలదు. అప్పటి బ్రాహ్మణ గృహమునకు నడుమన 'అగ్నిశాల' దాని ప్రక్కన 'హావిర్ధానము-పత్నీసదనము-వరండా, చాల గదులు' ఉండెనట. ఋగ్వేదమున వేయి స్తంభములు, వేయి ద్వారములుకల ప్రాసాదములో వసించు ఒకరాజు చెప్పబడినాడు. మిత్రావరణుడు నూరు స్తంభములు, నూరు ద్వారములుగల భవనమును ఆక్రమించుకొని ఉండిన గాథ కలదు. అప్పుడు ఒక 'అయస

పురము' కూడా ఉన్నట్లు ఋగ్వేదమున కానవచ్చుచున్నది. తైత్తిరీయ సంహితలో వివిధాకృతులుగల దశచితులు వర్ణింపబడియున్నవి. బోధాయన ఆపస్తంబ మహర్షులు తమ 'శుల్బ' సూత్రములలో ఈ చితుల ఆకృతులు వివరముగ తెలిపినారు. 'చితి' యనగా యజ్ఞశాలలోని వేదిక. ఈ హోమవేదికలకు అయిదు వరుసలలో వేయి ఇటుకలు వాడబడుచుండెను. ప్రతి వరుసలోని ఇటుకల పేర్లు వాని కొలతలు వివరింపబడినవి.[4]

## 2

వేదయుగము తర్వాతివి 'మొహంజోదారో-హారప్పా' త్రవ్వకాలలో బయల్పడిన ప్రాచీన శిథిలములు. వీనిని చరిత్రకారులు సింధు లోయ నాగరికత అని వ్యవహరించుచున్నారు. ఇవి మన వాస్తుశాస్త్ర ప్రాభవమునకు ప్రబల నిదర్శనములుగ యున్నవి. భారతీయుల ఔన్నత్యమును సహింపలేని చరిత్రకారులు ఈ శిథిలనగరములను ప్రాగ్వైదిక అనార్య సభ్యతలోనివిగా చెప్పి వితండ వాదములు చేయుచున్నారు. కాని భారతీయ విద్వాంసులు ఈ హారప్పా సంస్కృతి వైదికసంస్కృతికి ఆధునికరూపమని నిర్ధారించి వీనికాలము క్రీ. పూ. 4 వేల సంవత్సరములయి ఉండునని తెల్పినారు.[5] 'మొహంజోదారో' అను శబ్దమునకు 'చచ్చినవారి దిబ్బ' (*The mound of the dead*) అని అర్థము. దీని కీ పేరు ఎందుకు వచ్చెనో తెలియదు. ఈ ప్రదేశము సింధునదికి పశ్చిమ తీరమున నున్నది ఇచ్చట దిబ్బను త్రవ్వగా ఒక నగరము మీద మరొక నగరము కట్టబడినట్లు తెలిసినది. ఇచ్చటి త్రవ్వకాలలో ఆ కాలమునాటి అందమైన దేవమూర్తులు, గృహోపకరణములు, ఆభరణములు ఆయుధములు, మొదలైన అపూర్వ

4. *MANASARA SERIES— VI by P. K. Acharya.*
5. 'Proto Indie Religion' by Dr. S. Sreekantha Sastry.
(డా. ఎస్. శ్రీకంఠశాస్త్రి)

వస్తుసామాగ్రి బయటపడినది. ప్రాచీన నగరములు, విశాలమైన వీధులు ఇరుప్రక్కల కాలిబాటలు, మురుగుకాల్వలు, నీడకై వేసిన చెట్లపాదులు, అన్ని సౌకర్యములు గల గృహములు, బావులు మొదలైన విశేషములు బయలుపడినవి. పంజాబులోని హరప్పా త్రవ్వకాలలో బయలుపడిన వస్తు సామాగ్రి, నిర్మాణ రీతులు అన్నియు మొహంజోదారోలో లభించిన వానినే పోలియున్నవి ఈ హరప్పా అతి ప్రాచీన నగరము. ఋగ్వేదమునందు (VI-3-27) 'హరియూపియా'-'యవ్యాపతీ' అను పేర్లతో వ్యవహరింపబడిన నగరము ఇదే అని మన విద్వాంసులు తెలిపినారు.[6] 'ఇప్పుడు ఈ ప్రదేశములు పాకిస్తాన్‌లో చేరిపోయినవి.

### 3

వేదముల తర్వాత అంతటి ప్రాచీన ప్రామాణిక వాఙ్మయము ఆగమములు. ఇవి శైవాగమములు, వైష్ణవాగమములు శాక్తేయాగమములు అని మూడు విధములుగ నున్నవి. వీనిని తంత్రములనియు వ్యవహరించెదరు. వీని ప్రామాణికతను గూర్చి మనువు ఇట్లు చెప్పెను.

"వైదికీ తాంత్రికీ చైవ ద్వివిధా శ్రుతికీర్తితా"

అనగా శ్రుతి వైదికమని తాంత్రికమని రెండు విధములు. తాంత్రికములు గూడా స్వతః ప్రమాణములైనవని భావము. వీని ప్రాచీనతను తెలుపు కాల నిర్ణయము చేయుట కష్టము. మహాభారతము నందు 'పాశుపత-పాంచరాత్రము'లు పేర్కొనబడినవి

"సాంఖ్యంయోగః పాంచరాత్రం వేదాః పాశుపతం తథా"

6. (అ) Indian Antiquary 1925 Jan. by Binod bihar Roy.
(ఆ) భారతీయ సంస్కృతి (కన్నడ.)-డా. శ్రీకంఠశాస్త్రి 1954

జ్ఞానాన్యేతాని రాజర్షే విద్ధి నానా మతానివై" (శాంతిపర్వము:)
ఇందు చెప్పబడిన పాంచరాత్రము వైష్ణవమును, పాశుపతము శైవమును సూచించును. వీనికి ఆగమములే మూలము. ఆగమములందు ఆలయ నిర్మాణ మూర్తిప్రతిష్ఠా-వాస్తుశిల్ప విశేషములు శాస్త్రీయపద్ధతిలో వివరింపబడినవి.

**4**

ప్రాచీన కావ్యేతిహాసములగు రామాయణ మహాభారతములందు ఆ కాలమునాటి మహానగరములు, విజయతోరణములు, పలు అంతస్తుల హర్మ్యములు దేవాయతనములు, ఉద్యానవనములు, ప్రాకారములు, సమావేశ శాలలు, గృహములు సుందరముగా వర్ణింపబడినవి

"దేవాయతన చైత్యేషు సాన్నభక్షాః సదక్షిణాః"

(అయో: 3-18)

"దేవాయతనచైత్యేషు ప్రాకారాట్టాల కేషుచ"

(సభా : 80-30)

మనుస్మృతి మొదలైన ధర్మశాస్త్రములలోను, వ్యాసప్రోక్తమైన పురాణములలోను దేవతార్చనా వాస్తు విశేషములు తెలుపబడియున్నవి

**వాస్తు శాస్త్రములు:** భారతీయ వాస్తు శిల్పములకు ఆగమములే మూలములు. ఇందు శాస్త్రీయ చర్చ గలదు. ప్రతి ఆగమములోని క్రియాపాదమునందు ఆలయనిర్మాణ, మూర్తి రచనా ప్రతిష్ఠాతంత్ర, గృహనిర్మాణ, వాస్తు పూజా శిల్ప విశేషాదులు నిరూపింపబడినవి. ఆగమములలో ముఖ్యముగా కామికాగమ, అంశుమద్భేదాగమ, కారణాగమ, సుప్రభేదాగమ, వైఖానసాగమములలో విశేషముగా క్రమబద్ధముగా వాస్తు లక్షణములు చెప్పబడినవి.

ఇవి గాక ప్రత్యేకముగా వాస్తు లక్షణములను వివరించు శాస్త్రములును కలవు "మయమత-మానసార-కాశ్యప శిల్ప-ఆగస్త్య సకలాధికార-విశ్వకర్మీయ-సనత్కుమార వాస్తు-విశ్వామిత్ర సంహిత ఆ యా దిలక్షణ - మనుష్యాలయ చంద్రికా - వాస్తు విధాన - తంత్ర సముచ్చయ-ప్రయోగమంజరి-షట్పంచాశిక-వాస్తువిద్యా-శిల్పరత్న-శిల్పమండన-అభిలషితార్థ చింతామణి-సమరాంగణ సూత్రధార-అపరాజిత పృచ్ఛ-వాస్తురత్నావళి-ప్రతిమాలక్షణ - రూపమండన - వాస్తు మండన-ఈశానగురుదేవ పద్ధతి - గార్గ్య సంహిత - నారద సంహితా"ది గ్రంథములు సకల వాస్తు విషయములను తెలుపుచున్నవి.-ఈ శాస్త్రములు భారతదేశమునందలి వివిధ ప్రాంతములలో ప్రామాణికములుగా గ్రహింపబడుచున్నవి. శ్రీ ప్రసన్నకుమార ఆచార్యులు విశేష శ్రమ చేసి ప్రపంచ దేశములలోని పట్టికల ఆధారముతో 150 వాస్తుశాస్త్రముల పేర్లను కొన్నిటి విషయసూచికలతో ప్రకటించినారు.[7]

'చిత్రసారము' అను గ్రంథమునందలి 'శిల్పతంత్ర ప్రకరణము'లో శిల్పశాస్త్రము ద్వాదశ లక్ష గ్రంథాత్మకమని చెప్పబడినది. దీనిని పలువురు మహర్షులు రచించిరి.

"ఏతత్తంత్రాది సంఖ్యాతు లక్షద్వాదశకా మతా,"[8] ఇంత అపార వస్తు వాఙ్మయము భారతదేశమున తప్ప మరే దేశము నందును లేదు. వీనినిబట్టి మన వాస్తుశిల్పము ఎంత మహోన్నత స్థితిలో ఉండెనో తెలిసికొనవచ్చును.

**వాస్తు భేదములు :** 'వాస్తు అను శబ్దము 'వస=నివాసే' అను ధాతువు నుంచి పుట్టినది. అనగా మానవ నివేశనములను గురించి

7. " An Encyclopeadia of Hindu Architecture. "
8. " Indian Architecture " - Vol. 1 by Ananta Alwar

చెప్పునట్టిది అని అర్థము. కామికాగమము ఈ వాస్తువు రెండువిధములని చెప్పినది. 

1) స్థల ప్రధాన వాస్తువు 2) జల ప్రధానవాస్తువు అనునవి. స్థల ప్రధాన వాస్తువు నందు-భవన నిర్మాణమునకు తగిన స్థలమును ఎన్నుకొనుట. జల ప్రధాన వస్తువు నందు-మనుష్యునకు అవసరమైన జలము ఉండు ప్రదేశమును ఎన్నుకొనుట వివరింపబడును. మొదటిది మరల రెండు విధములు 1) హర్మ్యాదివాస్తువు. 2) పర్యంకాది వాస్తువు అని, వీనిలో మొదటిది శాశ్వత నిర్మాణములగు దేవాలయములు, మంటపములు, రాజ భవనములు, సభాంగణములు, ప్రేక్షా గృహములు (నాటకశాలలు) మొదలైనవానికి తగిన స్థలములను నిర్మాణవిధానములను గురించి చెప్పును. రెండవది తాత్కాలికములైన శిబిరములు, మంచములు, శకటములు, పల్లకులు, డోలికలు, స్థిరములైన లాయములు, గోష్ఠులు మున్నగువానిని గురించి చెప్పును.



జల ప్రధాన వాస్తువు మూడు విధములుగ ఉండును.

1. జాంగల దేశము-ఇచట గులకరాతిలో చాల లోతున నీరుండును. అది క్షారముగ ఉండును. అక్కడ అరటి, తాటి, వెలగజాతులు పుట్టును. 2) అనూపదేశము :- జలసమృద్ధ ప్రదేశము. అక్కడ సురభిళ పుష్పజాతులు పెరుగును తెల్లని ఇసుక క్రింద నీటి ఊట లుండును. అక్కడ వ్యవసాయమునకు పనికివచ్చు నీటి జాలు లుండును అన్నివిధముల ఫల వృక్షములు మూలికలు పెరుగును. 3. సాధారణదేశము :- పై రెండు గుణములు గల ప్రదేశము.

జల ప్రధాన వాస్తువు మరల పది విధములు చెప్పబడినది. అచట బుట్టు తరులతా గుల్మాదులను బట్టి, జంతు. పశు, పక్ష్యాదులను బట్టి, ఈ విభేదములను తెలిసికొనవచ్చును.

వాస్తు వనగా గృహ నిర్మాణమునకు ఎన్నుకొన్న స్థలమే అయినప్పటికిని పొలములకు తోటలకు, వంతెనలకు, చెరువులకు చేయబడు స్థల నిర్దేశము కూడా వాస్తు వనబడును.

కామికాగమమున దేవాలయ వాస్తువు 16 విధములని, గృహ వాస్తువు 45 విధములని వాని వాని పేరులతో చెప్పబడినవి. దేవాలయ నిర్మాణరీతి ననుసరించి వాస్తువు ముఖ్యముగా నాగర-వేసర-ద్రావిడ అను మూడు రీతులుగా ఉండును. ఆకృతిని బట్టి స్త్రీ-పురుష-నపుంసక భేదములును ఉండును. నిర్మాణ వస్తు భేదములను బట్టి శుద్ధ-మిశ్ర-సంకీర్ణ అను మూడు వర్గము లుండును. నిర్మాణ భేదముల ననుసరించి భవనములలో సంచిత-అసంచిత-అపసంచిత అను విధము లుండును. మాన ప్రమాణ భేదములను బట్టి ఎనిమిది విధములైన ఆయములు చెప్పబడినవి. వాస్తు శాస్త్రములలో చెప్పబడిన ఈ భేదములన్నియు మన గృహ ప్రాసాద నిర్మాణమున పాటింపబడినవి.



# ౩. దేవాలయ ఆరంభ వికాసములు

## 1

**దేవాలయ తత్త్వము :-** మన ప్రాచీన దేవాలయము లన్నియు గుహాలుగనో, గుహాకృతి కలవిగనో ఉన్నవి. ఇందుకు కారణము వేదోపనిషత్తులలో ఇట్లు చెప్పబడినది.

"హృదయం తద్విజానీయాత్ । విశ్వస్యాయతనం మహత్ ।
తస్యమధ్యేవహ్ని
శిఖా-తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితః-సబ్రహ్మా సశివ స్సహరిస్సేంద్రసోక్షరః పరమస్స్వరాట్" (మహానారాయణోపనిషత్)
"బ్రహ్మపురే పుండరీకం వేశ్మ దహరోస్మిన్నంతరాకాశః"
(ఛాందోగ్యోపనిషత్)

మనుష్యుని హృదయ మను గుహాయందు దహరాకాశమున్న దనియు అందు జ్యోతి స్వరూపుడగు ఈశ్వరుడున్నాడనియు, భక్తుడు. ఈశ్వర సాయుజ్యము నందవచ్చుననియు, దేవాలయములు స్థూల దర్శనములై నిరూపించుచున్నవి. వేదయుగము నుండియు మానవు నకు బాహ్యప్రపంచమునకు ఉండవలసిన సంబంధమును ప్రదర్శించు టయే భారతీయ శిల్పోద్దేశము. సగుణోపాసన యందు జీవాత్మ పర మాత్మలకు గల సంబంధమును అభ్యాస మొనరించునపుడు చిత్తవృత్తుల ననుసరించి అధికార భేదములు ఉండక తప్పదు. అందువలననే విగ్రహా రాధకునిలో ఉన్న అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞాన మయ, ఆనందమయ కోశములను ఉత్తరోత్తర సాక్షాత్కారము చేసి కొనుటకై మన శిల్పరీతులు ఉదయించినవి.

"దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవస్సనాతనః
త్యజేదజ్ఞాన నిర్మాల్యం సోఽహం భావేన పూజయేత్"
(మహాన్యాసము.)

దేహమే దేవాలయము. అందలిజీవుడే దేవుడు. అజ్ఞానమే నిర్మాల్యము. దానిని త్యజించి ఆత్మజ్ఞానముచే అర్చింపవలెనని భావము

దేవాలయములు సంక్షేపముగా పరమేశ్వరుని బాహ్య సృష్టిని, మానవ దేహ రచనను, జీవప్రగతిని, వాస్తుశిల్పముల ఆధారముతో భక్తునకు తెలుపుటకై నిర్మింపబడినవి. ప్రకృతి జీవాత్మ పరమాత్మలకు గల సంబంధమును గూర్చి ఉపనిషత్తు ఇట్లు చెప్పుచున్నది.

"ద్వాసుపర్ణా సయుజా సఖాయః । సమానం వృక్షం పరిషస్వజాతే తయోరన్యః పిప్పలంస్వాద్వత్తి అనశ్నన్నన్యో అభిచాకశీతి।సమానే వృక్షే పురుషోనిమగ్నో అనీశయా శోచతిముహ్యమానః।జుష్టంయదా పశ్యత్యన్యమీశం అస్యమహిమానమితి వీత శోకః । అంగుష్ఠమాత్రః పురుషోజ్యోతిరివాధూమకః" (శ్వేతాశ్వతరోపనిషత్తు)

'మంచిరెక్కలు మైత్రికలిగి సమానములై ఉండు రెండు పక్షులు (జీవాత్మ పరమాత్మలు) ఒక చెట్టుమీద (ప్రకృతి-దేహము) ఉన్నవి. అందొకటి (జీవాత్మ) దాని తీయని పండ్లను (కర్మఫలమును) అనుభవించును. రెండవది (పరమాత్మ) దేనినీ అనుభవింపక ప్రకాశించుచుండును. ఒక చెట్టునందే పురుషుడు (జీవాత్మ) దిక్కులేక సంసారమున మునిగి శోకించుచున్నాడు. ఎప్పుడు మహిమగల ఈశ్వరుని చూచునో అప్పుడు శోకమును వదలుచున్నాడు. అంగుష్ఠ పరిమాణము కల పురుషుడు పొగలేని జ్యోతివంటివాడు' అని పై మంత్రార్థము.

ఈ శ్రుతి ప్రమాణము ననుసరించి దేహమునందలి మూడు తత్త్వములవలె దేవాలయమునందును మూడు తత్త్వములు ఉన్నవి. దేహమునందు దేహము-జీవాత్మ-పరమాత్మలు. దేవాలయమునందు

గర్భాలయము అఖండదీపము భగవన్మూర్తి. శరీరమున ప్రాకార శబ్దము దేహసామ్యమును చెప్పును. జీవస్థానమును అఖండ దీపము. అఖండ మనగా ఆరిపోరాదు. దేహమునుండి జీవుడు వెళ్ళిపోయిన అది అపవిత్రమైనట్లే. అఖండము ఆరిపోయిన దేవాలయము కూడా అపవిత్రమగును. అందువలననే అఖండ దీపము ఆరినచో సంప్రోక్షణ కర్మ చెప్పబడినవి. జీవుండు ఏవిధముగా అచ్ఛేద్యుడో, జ్యోతి స్వరూపుడో అఖండదీపము కూడా, జీవాత్మయే పరమాత్మగా పర్యవసించునని జ్ఞానవాదులు చెప్పెదరు.

"మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః" (భగవద్గీత)

"యదాత్మతత్త్వేనతు బ్రహ్మతత్త్వం దీపోపమేనేహయుక్తః ప్రపశ్యేత్"

ఆత్మజ్యోతిచే పరమాత్మను దర్శించునట్లే అఖండ దీపకాంతిచే భగవన్మూర్తిని దర్శింపవలయును. గర్భగృహమందలి ముందుభాగము అంతరాళము. అందు చీకటి ఉండును అది "తమసః పరస్తాత్" అను శ్రుతివాక్యమును స్ఫురింపజేయును. ఉపనిషత్తులలో చెప్పబడిన తాత్త్విక విషయముల ననుసరించి మొదట గుహాలయములు తరువాత అంధకారబంధురమగుచున గర్భాలయములు నిర్మింపబడినవి

భారతీయ శిల్పులు మతదృష్టితో వాస్తునిర్మాణమునకు చాల అవసరమైన సూత్రములను విధించినారు వీనిని అర్థరహితములని త్రోసివేయరాదు. అవి మానవకల్యాణమును, ఆరోగ్యభాగ్యమును దృష్టియందుంచుకొని నిర్వచింపబడినట్టివి

భారతీయులు విశ్వమంతయు భగవత్స్వరూపమని విశ్వసించెదరు. ఈ విషయము మహాభారత, విష్ణు సహస్రనామములందు చెప్పబడినది. ప్రాచీనజ్యోతిష్కుడగు బాదరాయణుడు సంవత్సరములో సూర్యకిరణ ప్రసారస్థానములను గుర్తించి 12 భాగములుచేసి రాశి చక్రమని పేరుపెట్టెను. అవేమేషాది ద్వాదశరాసులు. ఈ 12రాసు

లకు సరిపోవుచున్న నక్షత్రచక్రముగూడా గుర్తింపబడినది. దీనిని శింశుమారచక్రము అందురు. ఈ చక్రము యోగముద్రలో ఉన్న విష్ణుశరీరము నందలి వివిధభాగములుగా 'తైత్తరీయ బ్రాహ్మణము'న వర్ణింపబడినది. సప్తాశ్వములతో భ్రమణముచేయు సూర్యుడు సంవత్సరకాలములో విశ్వరూపుడగు విష్ణుదేవుని 12 దేహభాగములను దర్శించును. ఏరాశిద్వారా ఏ అంగమును దర్శించునో చెప్పబడినది.

ఈ కల్పనమే గ్రామగృహ నిర్మాణములోనూ చేయబడినది. వాస్తువుకూడా మానవదేహముగా భావింపబడినది. తూర్పుముఖముగా ఉన్న గృహద్వారము ముఖము, ద్వారమున కిరువైపుల ఉండు గూళ్ళు రెండు నేత్రములు, వాకిలికి ఇరుప్రక్కలఉండు వాతాయనములు నాసారంధ్రములు. తలవాకిలిముందున్న అంగణము శ్వాసకోశము, పొడవు మానవుని ఎత్తుగా పరిగణింపబడినవి భారతీయుల వలెనే గ్రీకులు, రోమనులు, ప్రాచీన ఐరోపియజనులు తమ ప్రాచీన సంప్రదాయములను భక్తితో అనుసరించిఉండిరి.

గ్రీకు తత్త్వవేత్త 'ప్లేటో' మహాశయుడు మనలను సమర్థించినాడు "ప్రపంచసౌందర్యమును మనముపైకి పోవుటకు సోపానములుగా గ్రహింపవలెను " ఇది మనము ఇహమునాధారముచేసికొని పరమును సాధింపవలెనని చెప్పుమాటను బలపరచుచున్నది. ఇట్టి ఆదర్శమునకును తర్వాతవచ్చి వ్యాపారదృష్టికిని గల తారతమ్యమును సుప్రసిద్ధకళావిమర్శకుడు "ఇ. బి హావెల్" స్పష్టము చేసినాడు. *"Europe says the noblest study of mankind is man. India declares it to be not man but god and Hindu art is only concerned in showing the relationship betwen the human and the divine nature."* ["యూరోపుఖండము మానవజాతి మహోన్నత అధ్యయనము మానవుడే అనిచెప్పును. కాని భారతదేశము మానవునిగాక, దేవునిగూర్చి తెలుసుకొనవలెనని నొక్కిచెప్పుచున్నది. అందుకనే

భారతీయ శిల్పము మానవునకు దివ్యసృష్టితోకల సన్నిహిత సంబంధమును తెలుపుటలో తోడ్పడుచున్నది."]

మానవరూప ప్రతిబింబమే దేవాలయమని చెప్పితిమి. దేహములో అగోచరముగ ఆత్మఉన్నట్లే దేవాలయములోని దేవుడు కూడా చూచువారికి వెంటనేగోచరముకాడు ఆలయమును దర్శించు భక్తుడు బాహ్యసౌందర్యమును లోపలి ఆత్మానుభూతిని పొందును. దీనిని సాకారోపాసన అందురు. కొందరు జ్ఞానులు మాత్రము దైవమును తమహృదయములోనే దర్శించి ఆనందించెదరు. ఇది నిరాకారోపాసనము అనబడును. అందరికినీ ఇది సాధ్యముకాదు. ఈ లోపమును తీర్చుటకే మహానుభావులైన మన పూర్వులు గొప్ప ఆలయములను నిర్మించి వానిలో భగవంతుని లీలలను శిల్పకళతో జోడించినారు. ఈ వైదికపద్ధతులవలెనే బౌద్ధనిర్మాణములలో కూడా బుద్ధుని జీవనమును, జన్మాంతరగాథలను, శిల్పచిత్రములలో ప్రదర్శించినారు. జైనులు కూడా ఇరువది నలుగురు తీర్థంకరుల, సిద్ధుల జీవనదృశ్యములను తమ ఆలయములలో చెక్కించినారు. మానవ జీవనమునకు ధర్మమే ఆధారము ఆ ధర్మమే భారతీయవాస్తు శిల్పాది కళలకును ప్రేరకశక్తిగానున్నది.

భారతీయ విశిష్ట మానవగుణములకు ముగ్ధుడై సుప్రసిద్ధ పాశ్చాత్యకళావేత్త "సిల్వన్ లీవీ" ఇట్లుప్రశంసించినాడు. "మానవత దేహాత్వమునందిమిడి ఉన్నది. ఏనామముతో దైవము నారాధించినను ప్రతిమానవుడు దేవుని దర్శింపగలడు, దేవుని మాటలువినగలడు, చివరకు తానేదైవముకాగలడు. తన జీవితములో ప్రతిక్షణము దేవునియం దేవసింపగలడు. ఈ దివ్యజీవనమునకు దీనాతిదీనులకు గూడా అవకాశములేక పోలేదు." అని తన జోహారులర్పించినాడు.

**దేవాలయారంభము :** వేదకాలమున యజ్ఞములకై "వంశములు" అను శాలలను, వేదికలను, వెదురు, ఇటుక, కర్రలతో నిర్మిం

చుచుండిరి. వేరువేరు యజ్ఞములను, వివిధరూప వేదికలను నిర్మించు చుండిరి. ఈ వేదికలను చితి–చయన–స్తూపములనుచుండిరి. "విష్ణోః స్తూపోసి" (తైత్తరీయ సంహిత) స్తూపము కేశబంధాకారమున ఉండెడిది. దేవాలయ నిర్మాణమునకు ఈ వేదికా పద్ధతియే మూలమని, వైదిక స్తూపచితులనుండియే జైన బౌద్ధుల స్తూపచైత్య విహారాది నిర్మాణములు అవతరించెనని భారతీయ విద్వాంసులు నిర్ణయించినారు.[9]

ఏ నిర్మాణనముకైననూ సామాన్యముగా దాని "తల విన్యాసము" (*Ground Plan*) ననుసరించి ఉపరిభాగము తీర్చబడును. కావున తల విన్యాసముల పరిశీలన ముఖ్యము. ఇంతవరకు కానవచ్చిన స్తూపచైత్య విహారాదుల దేవాలయముల తల విన్యాసములన్నియు ముఖ్యముగ మూడువిధములై యున్నవి. అవి "చతురస్ర"-వృత్త-అర్ధవృత్తాకృతులు కలవి. పై త్రివిధ విన్యాసములలో చతురస్ర-వృత్తములకు వైదిక కర్మలయందు చాలా ప్రాముఖ్యము కలదు. ఆ పరిభాష ననుసరించి చతురస్రమును 'స్థండిల'మని, వృత్తమును 'మండల' మని వ్యవహరించెదరు. ఔపాసనావిధులలో చతురస్ర వేదిక మీద అగ్నిని ఆధానము చేసెదరు. వైదిక యజ్ఞములలో మూడు విధముల హోమకుండములను. వేదికను ఉపయోగించెదరు. ఆకుండములలో చతురస్రముగ ఉన్నది 'ఆహవనీయము'ని, వర్తులముగ ఉండునది 'గార్హపత్యము'ని అర్ధవర్తులముగ నుండునది 'దక్షిణాగ్ని'యని చెప్పబడినది. ఈ అగ్నికుండముల ఆకృతులే కర్మలలో ఆసనములకు, ఆలయములలో తల విన్యాసములకు స్వీకరించినారు.

---

9. 1) భారతీయ సంస్కృతి (కన్నడ.) – డా. శ్రీకంఠశాస్త్రి.
   2) ప్రాచీన భారత్ – శ్రీ P. K. ఆచార్య.
   3) "Biginings of the Treditions of South Indian Temple Architecture" — Dr. P. R. Sreenivasan.

వైదిక శ్రాద్ధకర్మలో విశ్వేదేవతలకు స్థండిలాకృతిని, (చతురస్రము) పితృదేవతలకు మండలాకృతిని (వృత్తము), ఉపయోగించెదరు. వృత్తాకారకుండమును గార్హపత్యము అనుట, పితృదేవతలకు వర్తులాకృతిని ఉపయోగించుట గమనింపదగిఉన్నది, వీనివలన మండలాకృతికి ప్రాపంచిక సంబంధము స్పష్టమగుచున్నది. మనదేశమున అచ్చటచ్చట కానవచ్చు ప్రాచీన సమాధులు (*Pre-Historic stone circles*) బౌద్ధస్తూపములు వర్తులముగనే ఉన్నవి. పితృదేవతలకు విధింపబడిన మండలాకృతిని గ్రహించియే మనపూర్వులు తమ సమాధులను నిర్మించిఉందురు. ఈ సంప్రదాయమును విడువలేక బౌద్ధులు బుద్ధుని పవిత్రాస్థికలనుంచిన స్ఫాటిక పేటికలమీద మండలాకృతిలో స్తూపనిర్మాణముచేసినారు.

మన దేవాలయములు విశేషభాగము చతురస్రములుగా, దీర్ఘచతురస్రములుగా కొన్ని అర్ధవృత్తాకృతిగా నిర్మింపబడినవి మన స్థపతులు దేవాలయములకు మండలాకృతిని గ్రహింపకపోవుటకు కారణము అది పితృదేవతలకుద్దేశింపబడినందువలనకావచ్చును. "కామికాగమము"న మండలాకృతి అధమ మనిచెప్పబడినది. కేరళదేశమున మాత్రము కొన్ని దేవాలయములు మండలాకృతిలో నిర్మింపబడి ఉండుట విచిత్రము.

ఆలయవికాసము :- మనశాస్త్రములు వాస్తువు మూడు విధములని చెప్పినవి. ఆలయవిమానముల నిర్మాణభేదమును బట్టి ఈవిధము లేర్పడినవి. నిర్మాణముల పైభాగమును 'శిఖర-శిఖా-శిఖాంత-శిఖామణి' అని విభజించికొని మూలమునుండి శిఖరమువరకు చతురస్రముగా ఉండునది 'నాగరరీతి' అని, షడస్ర, అష్టాస్రములుగా ఉండునది 'ద్రావిడరీతి' అని, వృత్తాకారముగ ఉండునది. "వేసరరీతి" అని శాస్త్రములు చెప్పినవి.

ఆలయములు రెండు విధములుగా ఉండును. కొండలలో బండలను తొలచి చేసిన గుహాలయములు, శిలలతో కట్టిన నిర్మాణా త్మకములు అని. ఈ నిర్మాణాత్మక దేవాలయములే పై ౩ విధము లుగా కానవచ్చుచున్నవి.

'సాంచి'లోని ప్రాచీనాలయము విమానరహితముగా ముఖ మంటపముతో కూడిన గర్భగృహము కలది కానవచ్చినది. తరువాత ఆలయనిర్మాణమున చాల మార్పులు జరిగినవి. కాలక్రమమున గర్భ గృహము-అంతరాళము-ముఖమండపము-పైన విమానము - ప్రాకా రము - మహాద్వారము, ద్వారమంటపము - దానిపై గోపురము - కల్యాణమండపము - పాకశాల-విశ్రాంతి స్థలము-హోమశాల-లాయ ములు-భండారములు - వాహన శాల - రథ శాల - మొదలైనవానితో కూడి దేవాలయము విస్తృతరూపము దాల్చినది. ఏకకూట-యుగళ- త్రికూట-చతుష్కూట-పంచకూట దేవాలయములు వెలసినవి.

దేవాలయమున కనుబంధముగా విద్యలు, కళలు అభ్యసించు టకు ఘటికాస్థానములు వెలసెను. దేవుని సేవకై సంగీతనృత్యము లవసరమైనందున రంగమంటములు నిర్మితము లయ్యెను. అన్నప్రదా నమునకు సత్రములు, చికిత్సా సౌకర్యమునకై ఆతురాలయములు (వైద్యశాల), జనులకు రక్షణ కల్పించుటకై దుర్భేద్యప్రాకారములు, ధాన్యాగారములు, కోశాగారములు, చేర్చబడినవి. ఈ విధముగా దేవాలయములు రానురాను బహుకార్యసాధకముగా సర్వతోముఖ వికాసమును పొందినవి.

**దేవాలయ వాస్తువు :-** భారతీయ శిల్పి సకలశాస్త్రవేత్త. యోగవిద్యా రహస్యములను అనుష్ఠానముచే సాధించిన యోగీం ద్రుడు. వారు సంప్రదాయాభిజ్ఞులగుట వలన దేవాలయములో విగ్ర హములను విధివిహితముగా ప్రతిష్ఠించినారు వారిని ప్రోత్సహించిన రాజులు శ్రీమంతులు, మతధర్మ విశ్వాసము కలవారై ఉండిరి.

ఇంచుమించుగా అన్ని దేవాలయములను కట్టిన శిల్పులెవరో తెలియుట లేదు, హొయసల దేవాలయములలో శిల్పుల పేర్లు కానవచ్చుచున్నవి ఆంధ్రదేశమున ఉండవెల్లి, అలంపురము, మొదలైన కొన్ని స్థలములలోని ఆలయములమీద శిల్పులు మారుపేర్లతో కానవచ్చుచున్నారు. వారి పేర్లు "ఉత్పత్తి పిడుగు-లోకభీత-సంసారభీత-మారదూర" మొదలైనవి చెక్కబడినవి జైన, బౌద్ధ నిర్మాణములు కళాదృష్టితో ఉత్కృష్టములైనను ఆ నిర్మాత లెవరో అజ్ఞాతముగా ఉండుటకు శిల్పాచార్యుల నిర్లిప్తతయే కారణము కావచ్చును శ్రీ పి కే. ఆచార్యగారు తమ "హిందూవాస్తు విశ్వకోశము"నందు శిలా-శాసనముల ఆధారముతో 124 గురు శిల్పాచార్యుల పేరులను వారి వివరములను తెల్పినారు.

భారతీయ శిల్పులలో నాలుగు తెగలున్నవి. వీరు బ్రహ్మ సంతతియని శాస్త్రములు చెప్పుచున్నవి. మహాభారతము నందు పేర్కొనబడిన దేవశిల్పి 'విశ్వకర్మ' ఈ తెగలకు మూలపురుషుడు. ఆయన విశ్వ నిర్మాత. బ్రహ్మ నాలుగు ముఖములనుండి విశ్వకర్మ, మయ, త్వష్ట, మనువులు నలువురు ఉదయించిరి. వారికి వరుసగా స్థపతి, సూత్రగ్రాహి, వర్ధకి, తక్షకులు పుట్టిరి. వీని నుండియే నాలుగు తెగలేర్పడెను. ఈ శిల్పులచేతనే భారతీయ వాస్తు నిర్మాణ ప్రచారములు కొనసాగింవబడినవి.*

శిల్పులకు నిర్మాణమునందు స్థలనిర్దేశము, దిశానిర్ణయము, శుభ ముహూర్తాదులు తెలిసిఉండవలెను. శాస్త్రములలో చెప్పబడిన భూపరీక్షలను చేసి నిర్మాణయోగ్యస్థలమును నిర్ణయించవలెను. అది మహాపురుషుల సంపర్కముచే పవిత్రమైనదిగా ఉండుట మంచిది. వాస్తు శాస్త్రములలో క్రింది స్థలములు యోగ్యములని చెప్పబడినది—

---

* మానసార శిల్పశాస్త్రము. ౨ అధ్యాయము.

"క్షేత్రముల దగ్గర నదీ తీరమున, సముద్రతీరమున, నదీ సంగమమున, పర్వతముపైన, పర్వతము ప్రక్కన, అరణ్యములో, ఉపవనములో, ఉద్యానవనములో, సిద్ధాశ్రమములలో, పెద్దపల్లెలో, పట్టణములో, రమణీయ ప్రదేశములో, దేవాలయ నిర్మాణమునకు స్థలమును కల్పించవలెను" అని. మన ఆలయములన్నియు ఇంచుమించు ఇట్టి స్థలములలోనే ఉన్నవి.

ఈ స్థలములలో భూమిని పరీక్షించి యోగ్యస్థలమును గ్రహించెదరు. ఈ భూములలో పుట్టు వృక్షములనుబట్టి స్థలములు "సుపద్మ-భద్ర-పూర్ణ-ధూమ్ర భేదములు కలిగిఉండును. గ్రామ, నగర, దేవాలయ, భవనాదుల నిర్మాణమునకు ఒక క్రమ విధానము శాస్త్రములలో చెప్పబడినది. ఈ క్రమములో స్థలనిర్దేశము భూపరీక్ష, దిశానిర్ణయము, తల విన్యాసము, పాదులు త్రవ్వుట, గర్భవిన్యాసములు ముఖ్యమైనవి. అప్పుడప్పుడు శాంతులు, బలివిధానములు చెప్పబడినవి. గర్భవిన్యాసమనగా ద్వారము దగ్గరగాని భవన మధ్యమునగాని, పంచలోహ పాత్రనో, తామ్రకలశమునో నిక్షేపించుట ఆ తరువాత అధిష్ఠాన రచన చేయవలెను.

**అధిష్ఠానము:-** కట్టడములకు క్రిందఉండు భాగమును అధిష్ఠానమందురు పునాది మీద ఇది ఉండును. కావున దీనిని 'ఆద్యాంగము' అందురు. ఇది దృఢముగా ఉండవలెను. ప్రమాణభేదమునుబట్టి ఇది బహువిధములుగ ఉండును. సామాన్య గృహములకు ఇది అక్కరలేదు. దీనిని సహస్రస్తంభ మంటపములకు, రాజ ప్రాసాదములకు మహాద్వారములకు దేవాలయములకు, వాడుదురు. అధిష్ఠానములో అనేక అంతర్భాగములుండును. ఒక్కొక్క భాగమునకు ప్రత్యేక నామములు కలవు శాస్త్రములలో ఈ వివరములు చెప్పబడినవి. నిర్మాణ భేదము ననుసరించి అధిష్ఠాన భేదములు చెప్పబడినవి. ఈ అధిష్ఠాన పద్ధతి మనకున్నట్లే ప్రాచీన పాశ్చాత్య వాస్తువునందును

ఉన్నట్లు, పాశ్చాత్య వాస్తుశాస్త్రకారుడు "మార్కస్ విట్రువియస్ పోలియో" చెప్పినాడు. [10] అంతర్భాగముల ప్రమాణములనుబట్టి 5-6 అడుగుల ఎత్తు ఉండును.

అధిష్ఠానమును దృఢముగా నిర్మించి దానిమీద గర్భగృహమును, మంటపమును వీనిచుట్టు ప్రదక్షిణా పథమును, చుట్టుగోడలను కట్టి మూల విగ్రహము ననుసరించి పూర్వాభిముఖముగనో ఉత్తరాభిముఖముగనో ప్రవేశద్వారము లుంచెదరు.

**స్తంభములు :-** ప్రాచీనకాలమున మండపములకు, ప్రదక్షిణా పథము చుట్టునుగోడలకు బదులుగా స్తంభములను నిల్పుచుండి కుడ్యనిర్మాణము తర్వాత వచ్చినది. గోడలను కట్టినను లోభాగమున అర్ధ స్తంభములు నిలుపబడుచునే ఉన్నవి వానిని అర్ధ స్తంభములని కుడ్య స్తంభములవిఅనెదరు. ఆకారమునుబట్టి, చెక్కడములను బట్టిస్తంభములకు వివిధనామములు చెప్పబడినవి. 'మానసారశిల్ప శాస్త్రము' స్తంభములను సామాన్యములు, సాలంకారములు అను రెండు విభాగములు చేసినది. సామాన్య స్తంభములు 9విధములు. సాలంకార స్తంభములు 12 విధములు చెప్పబడినవి. ఈ భేదములన్నియు ప్రాచీన దేవాలయములలో కానవచ్చుచుండును. 'కాశ్యప శిల్ప శాస్త్రము' ఏ దేవాలయములో ఏ విధమైన స్తంభములుండవలెనో వివరించినాడు. స్తంభము లోనూ కొన్ని అంతర్భాగము లుండును.

స్తంభము క్రిందిభాగము 'ఉపపీఠము' దానిమీద చతురస్ర భాగము. దానిపై 'కుంభము' దానిమీద మరల చతురస్ర భాగము. దీనిని 'మంది' అనెదరు. దానిపైన 'బోధిక' ఉండును. దీనిని మనము 'బోదె' అనెదము. దానిపై 'బోధిక' ఉండును. దీనిని మనము 'బోదె' అందుము. 'బోధిక' మూడు విధములు. 1) 'చిత్రబోధిక' (రాతుసులు, మొసళ్ళు, మృగములు చెక్కినది.) 2) 'పత్రబోధిక'

10. Architecture - 1.

(లతలు, పత్రములు చెక్కబడినవి.) 3) 'తరంగ బోధిక' క్రింద అలలవలె చెక్కబడినవి.)

ఈ స్తంభములమీద దూలములు పైకప్పు వేయబడును. తరువాత గర్భగృహద్వారము, ప్రవేశద్వారము, ఇతరద్వారములు నిర్మించబడును. గోడలమీద విభిన్న రీతులు తీర్చబడును. సాధారణముగా గోడలమీద క్షుద్రస్తంభములు, కూట, శాలా, కోష్ఠ పంజర, కుంభ పంజర క్షుద్రపంజరములు తీర్చబడును.

గర్భ గృహముపై విమానము, దాని పై భాగమున గ్రీవము, శిఖరము, ఆ పైన కలశము స్థాపించబడును. ద్వారమునకు ముందున్న విశాల మంటపమునకు ముందు భాగములో అర్చా విగ్రహమునకు ఎదురుగా వాహన మందిరము, దాని వెనుక బలిపీఠము, ఆ వెనుక ధ్వజస్తంభము ప్రతిష్ఠింపబడును ధ్వజస్తంభమును రాతితో గాని, కర్రతో గాని చేయవచ్చును ఈ విధముగా దేవాలయమును నిర్మించవలెనని వాస్తు శాస్త్రములు చెప్పుచున్నవి.

—:(o):—

# ౪. ఆంధ్ర వాస్తు వికాసము

## 1

**బౌద్ధ వాస్తువు :-** ప్రాచీనములైన వైదిక దేవాయతనములు మట్టి, కర్ర, వెదురు, గడ్డి మొదలైన సామాగ్రిచే కట్టబడు చుండినందున అవి కాలగర్భమున గలిసిపోయి నేడు కానరాకున్నవి. ఇందువలన పాశ్చాత్యులు కొందరు భారతదేశమున బౌద్ధయుగారంభమునకు ముందు హైందవ దేవాలయములే లేవను నిర్ణయమునకు వచ్చిరి. మనకిపుడు దృగ్గోచరము లగుచుండు బౌద్ధ నిర్మాణములే ప్రాచీనములైనవి.

బౌద్ధము మొట్టమొదట ఉత్తరప్రదేశ్, బీహారు ప్రాంతములలో ప్రచారము నంది క్రీ॥పూ॥ ౩వ శతాబ్దిలో మౌర్యాశోకుని కాలమున ఆంధ్ర దేశమునకు ప్రాకెను. అప్పటినుండి క్రీ॥శ॥ 7వ శతాబ్దివరకు మన దేశములో బౌద్ధ నిర్మాణములు కొనసాగినవి. తెలుగు సీమలోని ప్రముఖ బౌద్ధ స్థానములలో అమరావతి, నాగార్జునకొండ, భట్టిప్రోలు, ఘంటసాల, జగ్గయ్యపేట, గుమ్మడిదుర్రు, సంకారము, రామతీర్థము, గోలి, శాలహుండము మొదలైనవి పేరెన్నికగన్నవి ఇచట నిర్మాణములు మన బౌద్ధ వాస్తువునకు నిదర్శనములుగ ఉన్నవి బౌద్ధవాస్తువునకు వైదిక యాజ్ఞశాలా వేదికాకుండ నిర్మాణరీతులే మూలాధారమని తెలిసికొన్నాము.

మనకు బౌద్ధ వాఙ్మయమునుండి బౌద్ధ నిర్మాణములు, వాని భేదములు తెలియుచున్నవి. బుద్ధుడు స్వయముగ చేసిన ఉపదేశములలో వాస్తువునుగూర్చి చెప్పుచు బౌద్ధుల విధులలో భవన నిర్మాణము ముఖ్యమన్నాడు. "భిక్షుకులారా ! మీరు విహారము, అర్థయోగము,

ప్రాసాదము, హర్మ్యము, గుహ అను అయిదింటిలో విశ్రమింపవలెను !" అనిఆదేశించెను వీని ఆకృతులు లక్షణములు ప్రత్యేకముగా తెలుపబడి నవి. ఇంతవరకు బౌద్ధ వాఙ్మయమున క్రింది గ్రంథములలో బౌద్ధ నిర్మాణములను గూర్చి తెలుపబడియున్నది.

1. జాతక కథలు ;- దీనిలో కొన్ని నిర్మాణముల ప్రశక్తి సూత్రము కలదు. వాని లక్షణములు వివరింపబడలేదు.

2. చుల్లవగ్గ-(VI_17.1) బౌద్ధుల విశ్రాంతి గృహ భేదములు తెలుపబడినవి.

11. చుల్లవగ్గ-(VI-17.1)

3. మహావగ్గ - (1-30.4)లో బౌద్ధ నిర్మాణములందు వేయు వర్ణ చిత్రములను గూర్చి తెలుపబడినది.

,, (III-5.9)లో గ్రామము వెలుపల నిర్మింప బడు సంఘారామ, ఉపాసక మందిరముల వివ రములు కలవు.

4. మహాసుదాసనసుత్త - ఇందు బౌద్ధ నిర్మాణములకు కర్ర ఇటుక, రాయి, ఉపయోగించుటను గూర్చి, భవన నిర్మాణమునకు అవ సరమైన అనేక సూక్ష్మాంశములను గురించి తెలుపబడినది.

5. వినయపుత్త - ఇందు ఏడంతస్తుల భవనములు, ఆవిరి స్నాన గృహములు పేర్కొనబడినవి.

6. మహావంశ
7. మహాపరినిబ్బానసుత్త

} వీనివలన కొన్ని బౌద్ధవాస్తు విశే షములు తెలియుచున్నవి.

బౌద్ధయుగము నాటి గృహములలో వివిధాలంకరణ సామాగ్రి తెరలు, చాపలు, ఆస్తరణములు, రత్నకంబళములు, తోరణములు, మొదలైనవి ఉండి సర్వతోముఖ సౌందర్యము విలసిల్లుచుండినట్లు బౌద్ధవాఙ్మయము చెప్పుచున్నది. [12]

**నిర్మాణ భేదములు :-** బౌద్ధవాస్తువులో స్తూపము-చైత్యము, విహారము, సంఘారామము ముఖ్యమైనవి. వీనిలో మొదటిదగు స్తూపము మూడు విధములుగ ఉండును.

1) శారీరక స్తూపము-బుద్ధుని అవశేష ధాతువుమీద కట్టబడినట్టిది. దీనిలో బౌద్ధగురువుల పవిత్రాస్థికలు గూడ ఉండవచ్చును. దీనిని సింహళమున 'దాగోబా' (ధాతుగర్భము) అనెదరు. బర్మాలో 'పెగోడా' అనెదరు. నేపాళములో చైతన్యము' అనుచున్నారు.

2. ఉద్దేశిక స్తూపము-బుద్ధుడు సంచరించిన పవిత్ర స్థలములలో ఆయన స్మారకముగా నిర్మింపబడినది.

3. పారిభోగిక స్తూపము - బుద్ధుడు ఉపయోగించిన భిక్షాపాత్ర, పాదుకలు మొదలైన వస్తువులను ఉంచికట్టినది. [13]

ప్రారంభకాల స్తూపములు చిన్నవిగా, వృత్తాకారముగ కట్టబడినవి. వానిని కర్రచీలలు గొట్టి దీపములతో, పుష్పములతో అలంకరించుచుండిరి. చుట్టును దారునిర్మిత ప్రాకారము లుండెడివి. తరువాత నిర్మాణ పద్ధతి మారెను. రాతికి ప్రాధాన్యము కలిగెను. ఆంధ్ర దేశమునందలి స్తూపములకు ఇతర ప్రాంతములలోని స్తూపములకు కొంత భేదము కానవచ్చుచున్నది. మన దేశములో ఇంతవరకు జరిగిన త్రవ్వకాలవలన కొన్ని స్తూపముల ఆకృతులు తెలియవచ్చినవి. నాగా

12. Manasara Series Vol. VI - By P. K. Acharya.
13. చారిత్రక వ్యాసములు 1-భా. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

ర్జునకొండ త్రవ్వకాలలో నాలుగువిధములైన స్తూపములు బయలు పడినవి.[14]

1) బావి వలె గుండ్రముగా ఉండు స్తూపము,

2) నడుమ స్వస్తి కాకారమున్న స్తూపము.

3) ఒకదానిలో ఒకటిగా బహువలయాకృతులలో ఉన్న స్తూపము.

4) బండిచక్రము వలె ఉన్న స్తూపము.

**నిర్మాణరీతులు:-** బౌద్ధ నిర్మాణముల విధానములు వివరింప బడుచున్నవి. వానిలో స్తూప నిర్మాణ రీతి క్రింది విధముగా ఉండును.

వృత్తాకారముగల ఎత్తయిన వేదిక, దానిమీద అర్ధగోళాకార అండము, దాని పైభాగమున హర్మిక, దానిమీద దండముతోగూడిన ఛత్రము, సాధారణముగ అన్ని స్తూపములకు ఉండును. వేదికమీద అండమునకు నాల్గుప్రక్కల ఆయక వేదికలు, వానిపై అయిదేసి ఆయక స్తంభములు, వేదికచుట్టు ప్రదక్షిణ పథము, దానిచుట్టు ప్రాకారము రచింపబడును. ఈ ప్రాకారమునకు నిలువు స్తంభములు, వాని మధ్య వెడల్పయిన అడ్డకమ్ములు, ఉంచబడును. స్తంభాగ్ర మును ఉష్ణీషమని, అడ్డకమ్మిని సూచి అని వ్యవహరించెదరు. స్తంభ సూచీ ఉష్ణీషములు మనోహర శిల్పవిరాజితములై ఉండును. ప్రాకార మునకు నాలుగు వైపుల సింహద్వారము లుండును.

ఈ స్తూపములను ఇటుకలతో, శిలలతో, మట్టితో నిర్మించెదరు, బుద్ధుని నిర్వాణము తరువాత ఆ మహాపురుషుని అవశేషములను,

---

14. ఆంధ్రదేశ చరిత్ర-భూగోళ సర్వస్వము. (౨) శ్రీ టి వి జి శాస్త్రిగారి వ్యాసము,

తరువాతి బౌద్ధ గురువుల అవశేషములనుఉంచి పైన అర్థగోళాకృతి అండమువంటి నిర్మాణము చేసెదరు.

బుద్ధునకు పూర్వము నుండియు స్తూపచైత్యము లుండినట్లు ఆధారములున్నవి. బీహారులోని 'టారిమూనందన ఘడ్' అను ప్రదేశమున గుండ్రని దిబ్బలు స్తూపాకృతిలో కానవచ్చినవి. అవి వేదకాలపు సమాధులని పరిశోధకులు చెప్పుచున్నారు. "ప్రాచీనార్యులు తమ యాగశాలలను, ఉన్నతవేదక-దాని మధ్య యూప స్తంభము, పైన అర్ధగోళాకృతిలో ఉన్న పైకప్పులతో నిర్మించుచుండిరి. వీనిని స్తూపములను చుండిరి. ఇవి రెండు విధములుగ ఉన్నవి. పైకప్పు అర్థగోళాకృతిలో ఉన్నవి, పైభాగమున శిఖరము గలవి. ఇట్టి యాగశాలలు గయలో, తలచేరి దగ్గరి మేనపురములో, కన్ననూరు సమీపములో ఉన్నవి"[15] అని ప్రసిద్ధ కన్నడ పరిశోధకులు శ్రీ శివరామ కారాత్ వ్రాసినారు.

ఈ స్తూపములనే చైత్యములనియు అనెదరు. కాని చైత్యములకొక విశిష్టరీతి కలదు. సంస్కృత శబ్దమగు 'స్తూపము' ప్రాకృతములో 'థూపో' అయినది. అనగా దిబ్బ అని అర్థము. బౌద్ధ వాస్తువులో ఇటుకలతోగాని, రాతితో గాని కట్టిన అర్ధగోళాకృతి సమాధి వంటి దానివి స్తూపమనెదరు

చైత్యము:-చైత్యశబ్దము వైదిక చితినుండి పుట్టినది. దేవాలయ వర్గములో చైత్యము మన ప్రాచీనగ్రంథములందు పేర్కొనబడినది-

"దేవాయతన చైత్యేషు-సాన్నభక్షాః సదక్షిణాః"

(రామా॥ అయో. 3-18)

"దేవాయతన చైత్యేషు-ప్రాకారాట్టాలకేషు చ"

(మ-భార॥ సభాంప॥ 80-30)

---

15. బాలప్రపంచ-(కన్నడము) 3 సం. పుటలు 1668.

బౌద్ధులు సమాధికై నిర్మించు స్తూపములకు బదులుగా చైత్యాల యము రూఢికి వచ్చినది. ఇది గజపృష్ఠాకార తలవిన్యాసమున కట్ట బడిన నిర్మాణము. దాని ఆకృతి ఈవిధముగా ఉండును. పొడవైన గుహ, దానివెనుక భాగము అర్ధవృత్తాకారములో ఉండును. దాని సమీపమున అఖండ శిలతో మొలచిన స్తూపాకృతి. పైకప్పు 40-50 అడుగుల ఎత్తున కమానువలె వంగి ఉండును. పైకప్పుభారమును వహించుటకు స్తూపమునకు రెండు వైపుల స్తంభశ్రేణి, స్తంభముల పైభాగమున కమలము, దానిమీద ఆమలకము, దానిపైన ఏనుగులు చెక్కబడి యుండును. గుహలో వెనుకభాగమున ఒకే శిలతో చెక్క బడిన స్తూపాకృతి, దానిలో ధాతుగర్భము ఉండును. ఈ రీతిలోని నిర్మాణమును చైత్యమందురు.

**విహారము:-** మత బోధకులు, వారి శిష్యులు కూర్చుండు విశాలమైన శాలలు విహారములనబడును. ఇవి చైత్యములకంటె విశిష్టమైనవి. తరువాత ఇందు అర్చకుల నుంచుటవలన విహారములలో గూడ ఆరాధనలు ప్రారంభమైనవి.

**సంఘారామము -** గ్రామము వెలుపల అంత దూరము, అంత దగ్గర కాకుండునట్లు నిర్మింపబడిన విశ్రాంతి మందిరము. రాయి-ఇటుక లతో కట్టబడిన గోడలు, కర్రతో, వెదురుతో నిర్మింపబడిన ప్రాకా రము కలిగియుండును. ఇందు ఉపాసకుని మందిర ముండును. దీనిని ఆరామమని, సంఘారామమని అందురు.

బౌద్ధుల్ నిర్మాణములనే కాక గుహాలయములను గూడ తొలిచి భవ్యశిల్పకళా విరాజితముల నొనర్చినారు. బౌద్ధ నిర్మాణ ములు ఆంధ్రదేశములలో పలుతావుల కానవచ్చుచున్నవి. వానిలో ముఖ్యమైనవి కొన్నియే కలవు.

**అమరావతి :-** గుంటూరు మండలములో కృష్ణాతీరమున అమరావతి ఉన్నది. ఆంధ్ర శాతవాహన రాజులకు రాజధానిగా

ప్రసిద్ధిగాంచిన ధాన్యకటకమునకు మైలు దూరములో అమరావతి కలదు. ఇప్పుడు దానిని ధరణికోట అనెదరు. ఇచటనే ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన 'ధన కటక మహాచైత్య' మున్నది. దానినే అమరావతీ స్తూపమందురు.

ఈ స్తూపము అశోక చక్రవర్తి కాలమున వెలసిన ప్రాచీన బౌద్ధ నిర్మాణము. మనదేశము నందలి బౌద్ధ నిర్మాణములలో సుప్రసిద్ధమైనది. ఇందలి వివిధ శిల్ప విన్యాసము ఆంధ్ర శిల్పుల కళా కౌశల్యమును ప్రపంచమునకు చాటుచున్నది

ఈ క్షేత్రము శాతవాహనుల కాలమున మహోన్నత్యము ననుభవించినది. బౌద్ధవాఙ్మయమునందుగల 'గండవ్యూహ' గ్రంథము నందు ధాన్యకటకమునకు 'విచిత్రమాలాధ్వజ వ్యూహ'మను పేరున్నట్లు, దాని సమీపారణ్యములో 'మంజుశ్రీ' బోధిసత్వు డుండినట్లు తెలుపబడినది. ఆ నాడు అమరావతి మహాయాన బౌద్ధమునకు ముఖ్య కేంద్రమై యుండెను ఆంధ్రదేశము నందలి బౌద్ధులలో చాల తెగలుండినవి. వారిని 'అంధకులు' అని, వారవలంభించిన సిద్ధాంతము 'మాధ్యమిక వాద'మని బౌద్ధ గ్రంథములు చెప్పుచున్నవి. మహాయానము నావిష్కరించిన మహనీయుడు ఆచార్య నాగార్జునుడు. ఆయన అమరావతీ విశ్వవిద్యాలయ కులపతిగా నుండినట్లు చెప్పెదరు. టిబెట్టులోని లాసా నగరము దగ్గరి 'డాంపంగ్' విద్యాపీఠమునకు ధాన్యకటక విద్యాపీఠమే మూలమని ఆ వాఙ్మయము తెలుపుచున్నది. తరువాత బౌద్ధము దక్షిణాపథమున క్షీణించెను. అంతటితో అమరావతి స్తూప వైభవ మంతరించినది.

**స్తూప విశేషములు:-** ఇచట శిల్ప ఖండములవలన శిలా ఫలకముల వలన కొంత తెలియుచున్నది వృత్తాకార మహావేదిక, దాని మీద అర్ధగోళాకార అండము, దానిపైన హార్మిక, దానిపై దండ

సహితచ్ఛత్రము గల పరిపూర్ణ స్తూపమిది. నాలుగుప్రక్కల ఆయక స్తంభములు వాని క్రిందిభాగమున స్తూప-ధర్మచక్ర-బోధి వృక్షాదులు తీర్చబడినవి మన దేశమునందలి స్తూపములకే ఆయకస్తంభ రచన కలదు. ఇతర ప్రాంతముల స్తూపములలో ఇవి లేవు వేదికచుట్టును శిలాప్రాకారము, స్తంభ-ఉష్ణీష-సూచీలకు రమణీయ శిల్పము చెక్కబడి యున్నది. ప్రాకారమునకు నాలుగు దిశలలో మహాద్వారములు కలవు ఈ స్తూపముమీద బౌద్ధగాథలు మనోహరముగ చెక్కబడినవి. పాలరాళ్ళపై తీర్చబడిన ఈ శిల్పకళాసంపద ప్రపంచ యాత్రికులను వెఱగుపఱచుచున్నది. భారతీయ శిల్పచరిత్రలో 'అమరావతీ రీతి' అను విశిష్టపద్ధతి రూపొంది తరువాత వారికి అనుసరణీయమైనది.

ఈ మహాస్తూపమునకు నేటి దుస్థితి హృదయవిదారకముగ నున్నది. మన ప్రబుద్ధులు ఇచటి సుందరశిల్ప కళాఖండములను సున్నమునకై కాల్పించి పాడుచేసినారనుట బాధ కలిగించును. ఆంగ్లేయుల పుణ్యమా అని ఈ మహాస్తూపము ప్రపంచమునకు పరిచయమైనది. ఇచటి భగ్నావశేషములు లండనుకు, కలకత్తాకు చేరినవి. కొన్ని మదరాసు మ్యూజియములోను, ఇండియాలోని ప్రసిద్ధములైన మ్యూజియము లన్నిటిలోను ఈ స్తూప శలకములు కానవచ్చును. ఈ శిల్పరీతిలోనే జగ్గయ్యపేట, నాగార్జునకొండ మొదలైన స్థలములలో స్తూపములు నిర్మించబడి నేడు శిథిలములై భగ్నావశేషములుగ మిగిలియున్నవి.

నాగార్జునకొండ - మన దేశమున అనేక బౌద్ధ క్షేత్రములు వెలసినను అమరావతి తరువాత పేర్కొనతగినది నాగార్జునకొండయే. ఇది గుంటూరు జిల్లాలోని పల్నాడు తాలూకాలో మాచెర్లకు 15 మైళ్ళ దూరమున కృష్ణాతీరమునం దున్నది.

ఈ తీరమునందు కొండలు, అడవులు, ఎత్తైన దిబ్బలు కానవచ్చును. ఇచటి దిబ్బలన్నియు బౌద్ధనిర్మాణావశేషములని చెప్ప

వచ్చును. ఈ కొండల లోయలో జరిపిన త్రవ్వకాలవలన స్తూపశిథిలములు బయటపడినవి పెద్ద ఇటుకలతో ఇచట నిర్మాణములు కొనసాగినవి. ఎన్నో బ్రాహ్మీ లిపి శాసనాలు, దేవాలయ శిథిలములు, స్తూప శిల్ప ఖండములు వెలుగు చూచినవి.

క్రీ. శ. 3-4 శతాబ్దులలో ఇచట ఇక్ష్వాకురాజులు విజయపురి రాజధానిగా పరిపాలన చేసినారు. ఇచట బుద్ధ ధాతువు నిక్షిప్తము చేసి మహాచైత్యమును నిర్మించియుండినట్లు శాసనములవలన తెలియుచున్నది. ఇప్పుడా స్తూపము పాడయి క్రింది వేదికలు మాత్రము కానవచ్చుచున్నవి. కొండలమీద బౌద్ధభిక్షుకువుల ఆవాసములు. చిన్న చిన్న స్తూపములు నిర్మించబడి శిథిలములైనవి. బౌద్ధవాఙ్మయమున ఇచటి కొండను 'శ్రీపర్వతము' అనుచుండిరి. ఇచటి త్రవ్వకాలలో శిథిలములైన స్తూపములు, సంఘారామములు, చైత్యాలయములు, బయటపడినవి.

ఇచటి నిర్మాణము ఇటుక - సున్నముతో చేయబడినది. పై భాగము పాడై, భగ్నావశేషమగు వేదిక, 5 అడుగుల ఎత్తు, 102 అడుగుల వ్యాసము కలిగి గుండ్రముగా ఉన్నది. వేదికచుట్టు 13 అడుగుల వెడల్పు గల ప్రదక్షిణ పథము, దాని నావరించిన ప్రాకారము 5 అడుగుల ఎత్తు ఇటుకగోడతో కానవచ్చుచున్నవి. నాలుగుపైపుల ద్వారములుండిన గుర్తులున్నవి. ఈ స్తూపనిర్మాణము ధర్మచక్రాకృతిలో జరిగినది. ఈ వేదికలో బయలుపడిన గుండ్రని రజత పేటికలో చిన్న బంగారు బరిణెలో ఉంచిన శనగగింజంత బుద్ధ ధాతువు కానవచ్చినది. దానిని బ్రిటిషుప్రభుత్వము సార్నాధులోని 'మూల గంధకుటీ విహారము' నకు దానముచేసినది.

ఇంతవరకు ఇచటి త్రవ్వకాలలో అనేక బౌద్ధ నిర్మాణ శిథిలములు కానవచ్చినవి. నిర్మాణములు ఇటుకలతో కట్టబడినను అక్క-

దక్కడ శిలాఫలకములపై జాతక గాథలు చెక్కబడియుండెను. ఆ మనోహర ఫలకములు నేలపై దొరలుచున్నవి. శిల్పచిత్రములు గల కళా ఖండములను, శిల్పరంజితములైన స్తంభములను, భగ్న మూర్తులను ఇచట మ్యూజియములో భద్రపరచినారు. కొన్ని హైందవ దేవాలయములును బయలుపడినవి. ఇందలి శిల్పరీతి అమరావతీ పద్ధతికి చెందినట్టిది

అమరావతి, నాగార్జునకొండల శిల్పకళా సంప్రదాయమే బర్మా, జావా, చీనా దేశములలో వ్యాపించి రమ్య నిర్మాణములకు మూలమైనది. 'బోరోబదూరు' మొదలైన విదేశములలోని బౌద్ధ నిర్మాణములు మన శిల్ప కళా వైశిష్ట్యమునకు ప్రత్యక్షనిదర్శనములుగ ఉన్నవి. [16]

## 2. జైన వాస్తువు

జైన మతము :- జైనము బౌద్ధమునకంటె కొంత ముందుగ ఉదయించినది. ఈ మత స్థాపకుడు వర్ధమాన మహావీరుడు. ఆయనను జినుడందురు. ఆయన బోధించిన మతము జైనమైనది. ఇందు 24 గురు తీర్థంకరులున్నారు. వీరిలో చివరి 23-24 తీర్థాంకరులైన పార్శ్వనాథ, మహావీరులు చాల ప్రసిద్ధులు. క్రీ.పూ. 6వ శతాబ్దిలో జైనము మగధరాజ్యమున ఉదయించి త్వరలోనే బీహారు, కళింగ ప్రాంతములలో వ్యాపించెను. ఈ మతము ఆంధ్ర దేశమున ఎప్పుడు ప్రవేశించెనో చెప్పలేము. కొన్ని గాథలవలన కొంత విషయము తెలియుచున్నది.

ఈ గాథల సత్యా సత్యము లెట్లున్నను దక్షిణ భారతమున, తెలుగునేలలో అశోకుని మనుమడైన 'సంప్రతి' కాలమున జైనము

16. క్రీ. శే మల్లంపల్లి సోమశేఖరశర్మగారి చారిత్రక వ్యాసములు. 1 భా.

వ్యాపించెనని చెప్పవచ్చును. తెలుగు దేశమున ఒక సాతవాహన రాజు జైన ధర్మమును నవలంభించినట్లు 'కాలకసూరిప్రబంధ'మున చెప్పబడినది అతనిపేరు తెలియదు. క్రీ శ. ప్రథమ శతాబ్దిలో గుంతకల్లు దగ్గర ఉన్న 'కొనకొండ్ల'లో పద్మనంది ఆచార్యుడుండెను. ఆయనను కొండకుందాచార్యు డనెదరు. అతడు దిగంబర శాఖకు చెందిన విద్వాంసుడు. సమయసారాది జైనమత గ్రంథము లనేకములను వ్రాసెను. ఆయనవలన దిగంబర జైనము, సంప్రతివలన శ్వేతాంబర జైనము మనదేశమున వ్యాపించినది.

**జైన వాస్తువు :-** జైనులకు అవశేషములమీద భక్తి విశ్వాసములు తక్కువ వీరు హైందవ దేవతలను కొందరిని గ్రహించిరి. జైన వాస్తు పద్ధతులు హైందవ వాస్తుపద్ధతులకు చాల సన్నిహితములుగ ఉన్నవి. 'జేమ్సుఫర్గూసన్' పండితుడు జైన కట్టడములు హైందవ నిర్మాణములే అని గట్టిగాచెప్పినాడు.[17] జైనబౌద్ధ శిల్పములకు దగ్గరిపోలికలున్నవి. ఈ రెండిటిని గ్రహించుటకు పరిశీలనానుభవము చాల అవసరము. మధురలో జైనస్తూపము క్రీ. పూ. 8వ శతాబ్దిలో ఉండిన పార్శ్వనాథ తీర్థంకరుని కాలమున నిర్మించ బడియుండునని "డా॥ బుహ్లరు, సర్ విన్సెంటుస్మిత్" గారలు అభిప్రాయపడినారు.[18] కల్పసూత్రములలో ఉల్లేఖింపబడిన అర్హంతస్తూపములు బహుశః జైనస్తూపములై ఉండవచ్చునని శ్రీ పి. కె ఆచార్యులు గారు వ్రాసినారు.

జైనవాస్తువును గురించి కొన్ని వాస్తుగ్రంథములందు చెప్పబడినది.

1. 'వాస్తుసార ప్రకరణము'—ఠక్కురుడు, ఇందులో 25 విధములైన జైనప్రాసాదములు, శిఖరములు చెప్పబడినవి.

---

17. Indian and Eastern Architecture—Vol. II
18. Jaina Stupa and other Antiquitics of Mathura.

2. 'ప్రాసాదమండనము' ) వీనిలో జైన ప్రాసాద-నిర్మాణముల
3. 'దీపార్ణవము' } వివరములు కలవు

4 'మానసార శిల్పశాస్త్రము'- ఇందు జైన బౌద్ధ దేవాలయములు నగర బహిర్భాగమున కట్టవలెనని చెప్పబడినది.

5. 'వివేకవిలాసము'- ఇందు జైనాలయములను గూర్చి విగ్రహములను గూర్చి వివరింపబడినది.

జైనగుహాలయములు ఒరిస్సా, ఎల్లోరా, అంకాయ్ మొదలైన స్థలములలో ఉన్నవి. మనదేశమునందు గుంటుపల్లి కొండలలోకొన్ని గుహాలయములున్నవి. ఈ ప్రాంతమున లభించిన శాసనముల వలన మహామేఘవాహనుడను నతనికాలమున ఈ గుహాలయములు తొలచబడినట్లు తెలియుచున్నది. కళింగాధిపతి అయిన 'ఖారవేలునకు' మహామేఘవాహన బిరుదమున్నది. అతడు వేంగీ-కళింగములలో జైనమతమును వ్యాపింపజేసినట్లు ఆధారములున్నవి. తరువాత ఈగుహాలు బౌద్ధులచే ఆక్రమింపబడినవి.

జైనులు నిర్మించిన ఆలయాలు లక్కుండి, గిరినార్, ఆబూ పర్వతము, ఖజరాహోర్, చిత్తోడ్ మొదలైన స్థలములలోఉండి అన్ని విధముల హిందూదేవాలయములను పోలిఉన్నవి. జైన వాస్తువులో ఉత్తర దక్షిణ సంప్రదాయములు విభిన్నములైనవి. వీరి దక్షిణ పద్ధతిలో రెండు ప్రధాన విధములున్నవి. 'బసది', 'వాసికా' అను భేదములు. 'బసది' అనగా పూజామందిరము. 'వాసికా' అనగా నివాస స్థలము. ఔత్తరీయ పద్ధతిలో 24 గురుతీర్థంకరులలో ఒకరు ప్రతిష్ఠింపబడిన 'బసదులు' మాత్రమే కానవచ్చును. అచట వాసికలు లేవు.

సాధారణముగా వాసికలలో గోమతేశ్వర విగ్రహములుండును. ఇవి ఔత్తరీయులకు అపరిచితములు [19]

జైన నిర్మాణములు :- ఆంధ్రదేశమునందలి కొన్ని శిలాశాసనములలో జినాలయములు నిర్మింపబడినట్లు కానవచ్చుచున్నది. కాని నేడవి అన్నియు నష్టములైనవి.

రెండవపులకేశి కాలమున 'అయిహొళె'లో జైనాలయము నిర్మింపబడినది. ఈ ఆలయమే తరువాత ఆంధ్రదేశమున వెలసిన జినాలయములకు మార్గదర్శకమైనదని చెప్పవచ్చును.

ఒంగోలు తాలూకా ధర్మవరములో మూడు చిన్నచిన్న జినాలయములు నిరలంకారముగా కానవచ్చుచున్నవి. వేంగీచాళుక్యులకు మూలపురుషుడైన కుబ్జవిష్ణువర్ధనుని భార్య 'మహాదేవి' బెజవాడలో జైనతపోధనులకు 'నడుంబివసతి'ని కట్టించి అందలి జినాలయమునకు మునికొండ గ్రామమును దానమిచ్చినది. ఇప్పుడది కానరాదు, 9శతాబ్దిలో పూర్వచాళుక్యకుల వధువు క అ విష్ణువర్ధనుని పత్ని 'శీలమహాదేవి' రాష్ట్రకూట కరకసువర్ణ వర్షుని సోదరి ఆమె ఎల్లోరాలో తన పుట్టింటివారు చెక్కించిన గుహాలయములను దృష్టి యందుంచి కొని గోదావరి జిల్లాలోని బిక్కవోలులో వర్ధమాన మహావీర తీర్థంకరునకు ఆలయముకట్టించెను. నేడు దానిలో విగ్రహము లేకున్నను ఆలయనిర్మాణరీతి విశిష్టమైనది.

ఈ జైనాలయము బిక్కవోలు సమీపమున పొలములో ఉన్నది, ఆ ఊరిలోని హైందవాలయ నిర్మాణరీతిలోనే ఇది కట్టబడినను వానిలో ఉన్న శిల్పాలంకరణములేవియు దీనిలోకానరావు. ఆలయ కుడ్యముల మీద ఎట్టి మూర్తిశిల్పములేదు. చుట్టుగోడలమీద స్తంభాకృతులు తీర్చబడినవి. వానిమధ్య దేవకోష్ఠములుగాని, పంజరములు

19. Manasara Series, Vol-IV, by Sri. P. K. Acharya.

గాని లేవు. ద్వారబంధమునకు రెండువైపుల ద్వారపాలకులున్నారు. ద్వారము మీది మసూరకమునకు (అడ్డపట్టెకు) గజలక్ష్మి చెక్కబడి నది ఆలయనిర్మాణపద్ధతి బాదామి చాళుక్యపద్ధతిలోగాక ద్రావిడ పద్ధతిలో ఉన్నది. ఇంచుమించుగ పూర్వచాళుక్యుల ఆలయము లన్నియు ద్రావిడపద్ధతిలోనే నిర్మింపబడినవి ఆలయముపై ఉన్న విమానము పల్లవనిర్మాణ రీతిలోఉన్నది. ద్వారపాలకులు భిన్నరీతు లలో నిలిచిఉన్నారు. వీరి ప్రక్కల ఒక్కొక్క చేటికఉన్నది ఈ పద్ధతి పల్లవనిర్మాణములలో, బాదామి చాళుక్యాలయములలో కానవచ్చుచున్నది.

జైనులు తెలుగుసీమలో కొండలను తొలచి సంఘారామము లను, జినాలయములను రచించినట్లు కనబడలేదు సహజముగ ఏర్పడిన కొండ గుహలను మాత్రము వాసస్థానములుగ చేసికొని కొన్ని శిల్ప ములను చెక్కించినారు సాధారణముగ జైనులు తమ నివాసములకు నిర్మాణములకు ప్రత్యేక స్థలమును ఎన్నుకొనెదరు విశాలమైన బయలు దానిచుట్టు కొండలు వున్నచోట వానిమధ్య ఉన్న సందు లలో మట్టిగోడలు కట్టి దృఢప్రాకారము కల్పించెదరు. దానిలో ఆలయాలను, నివాసములను తటాకమును నిర్మించెదరు. నడుమ పెద్ద గుండు వున్నచో దానిపై ఆలయాలు కట్టెదరు. అట్టివానిని 'చర ణాద్రు'లనెదరు. కొనకొండ్ల, హనుమకొండ, నల్లమల ఇట్టి స్థలములే.

రాష్ట్రకూటులకాలమున చిత్తూరు జిల్లాలోని 'మల్లమల' కొండలలో జైన మునులకు వసతి కల్పించబడినది. ఈ కొండలో సహజమైన విశాల గుహలో వీపుగోడకు అర్ధ పద్మాసనములో కూర్చుండి ఉన్న తీర్థంకర విగ్రహములను చెక్కి వారి ఒక ప్రక్కన యక్షిణిని, మరొకప్రక్కన ఐరావతారూఢుడైన ఇంద్రుని చెక్కించి

నారు ఇచ్చట 'అజ్ఞనంది' ఆచార్యుడు సపరివారముగ వసించినట్లు అందలి శాసనములు చెప్పుచున్నవి.

హైదరాబాదునకు 16 మైళ్ళ దూరములోని 'పటంచెరువు' జైనమునకు ముఖ్యస్థలమై యుండెను ఇచటి జినమూర్తులు 10 అడుగుల ఎత్తు గల మహామూర్తులు. కళ్యాణి చాళుక్యుల కాలమున గర్భాలయము మీది విమానరీతి మార్పుచెందినది ఈ విమానములు కదంబ వాస్తుశైలిని పోలి ఉన్నవి. క్రిందినుండి పైవరకు అడ్డముగ తీర్చిన పట్టెలు సోపానరీతిలో క్రమముగ తగ్గుచు నూత్న సౌందర్యమును కలిగించుచున్నవి. ఒక మహామంటపములో ప్రదక్షిణపథము లేకుండ వీపుగోడనానుకొని వరుసగ మూడు గర్భాలయములు కట్టబడినవి. మంటపమునకు మూడువైపుల గోడలచే మూయబడిఉన్నది మధ్యనున్న గర్భగృహము మీద విమానము కొంత ఎత్తుగ, తక్కిన రెండిటి విమానములు చిన్నవిగ నిర్మింపబడినవి. గర్భాలయ ద్వార బంధముల మీద ద్వారపాలకులకు బదులుగా క్రిందిభాగమున పూర్ణ కుంభములు తీర్చబడినవి.

అనంతపురం జిల్లాలోని కంబదూరులో ఒక జైనాలయము కానవచ్చుచున్నది. అందు గర్భగృహము, అంతరాళము, ముందు భాగమున విశాల స్తంభ మంటపముఉన్నవి ఆలయముచుట్టును శిలా ప్రాకారముకలదు. ప్రాకారద్వారబంధములకు క్రిందిభాగమున పూర్ణ కుంభములు, ద్వారముపైని మసూరకము మీద ఆసీన జినమూర్తి చెక్కబడినవి గర్భాలయ ద్వారబంధములకు రెండుప్రక్కల నిలిచి ఉన్న ద్వారపాలకులు, మసూరకము మధ్యభాగమున కూర్చున్న జినమూర్తి ఉన్నారు. ఆలయనిర్మాణము పూర్తిగ హిందూ దేవాలయపద్ధతిలోనే ఉన్నది.

నల్లగొండ జిల్లాలోని 'కొలనుపాక' నేటికిని సుప్రసిద్ధ జైన క్షేత్రము. ఇచటి ఆలయములో మరకతశిలతో చేయబడిన 'పార్శ్వ

నాథ' విగ్రహమున్నది. భారతదేశమునందలి సుప్రసిద్ధ జైనస్థానము లలో ఇది ఒకటియై ఇప్పటికిని పూర్వవైభవము ననుభవించుచున్నది.

తెలుగుసీమలో కొనకొండ్ల, చిప్పగిరి, తొగరకుంట, పెనికల పాడు, గంగపేరూరు, హనుమకొండ, రామతీర్థము, రాయదుర్గము పెనుగొండ, దానవులపాడు, వల్లిమల, బోధన్, విజయవాడ, ఆర్య వటము, తుంబళము, ఆదోని, నాయకల్లు, కంబదూరు, అమరా పురం, మునుగోడు, భోగాపురం, వేములవాడ, పటంచెరువు, పూడూరు, పెద్దకడుమూరు, కొలనుపాక మొదలైన అనేక ప్రదేశ ములు జైనస్థానములుగా ప్రసిద్ధికెక్కిఉండెను. వీనిలో ఒక్కొక్క చోట బసదిగాని, వాసికగాని నిర్మింపబడియుండును. నేడవిఅన్నియు పాడైపోయినవి. కాని ఈ స్థలములతో అక్కడక్కడ జైనభగ్నా వశేషములు ఇప్పటికిని కనబడుచు పూర్వ నిర్మాణములను జ్ఞప్తికి తెచ్చుచున్నవి.[20]

బౌద్ధము నైరాత్మ్యవాదము కావున భారతదేశమున లేకుండ పోయినది. జైనము ఆత్మను అంగీకరించునది కావున వేదప్రామా ణ్యమును ఆమోదింపకున్నను నేటికిని మిగిలియున్నది. తెలుగు నేలలో బౌద్ధమునకంటెజైనమే ఎక్కువ వ్యాప్తిగాంచియుండి నేడు నామావశిష్టమైనది.

—:(o):—

20. Jain vestiges in Andhra—By Dr. S. Gopalakrishna Murthy

# ౫. హైందవ వాస్తు కళారీతులు

## 1

ప్రాచీనాలయములు :- సోమ యజ్ఞమునకై వైజ్ఞానిక శైలిలో ఇటుకలచే నిర్మింపబడుచుండిన పెద్దవేదికలు, త్రేతాగ్ని కుండములు మనదేవాలయ నిర్మాణమునకు మూలాధారములు. ఈ వేదికలను చితులనుచుండిరి. ఈ చితులు పలువిధములుగ ఉన్నవి. వీని ప్రస్తావన తైత్తిరీయసంహిత (యజుర్వేదము)లో కానవచ్చును. బోధాయన-ఆపస్తంబులు తమ శుల్బసూత్రములలో వేదికా నిర్మాణ రీతి, వాని భేదములు, వాని పరిమాణములు, మొదలైనవానిని వివరించినారు. మిగుల ప్రాచీనకాలమున దేవాలయములను మట్టి, కర్ర, వెదురు మొదలైనవానిచే నిర్మించికొనుచుండినందున అవి కాలగర్భమున గలసిపోయి కానరాకున్నవి. మనకు చారిత్రకముగ క్రీ. పూ 200 సంవత్సరముల నుండి దేవాలయ నిర్మాణములను గూర్చి తెలియుచున్నది.

"క్రీ. పూ. 200 సంవత్సరముల నాటి 'నగరి' శిలాశాసనమునందు సంకర్షణ, వాసుదేవ పూజకొరకు దేవాలయ నిర్మాణము చేయించిన విషయము చెప్పబడినది. మన ఆలయాలకు, మూర్తి పూజకు చాల ప్రాచీన లిఖితప్రమాణ మిదే. అని మహామహోపాధ్యాయ గౌరీశంకర హీరాచంద్ర మహాశయుడు తెలిపినాడు. [21]

ఇంచుమించుగ ఇదే కాలమునాటి ఒక ప్రాచీన దేవాలయము 'సాంచి'లో కానవచ్చుచున్నది. అది ఒక చిన్న గర్భగృహము. పైన విమానము లేదు. ముందు ముఖ మంటపము మాత్ర మున్నది.

---

21. 'మధ్యకాలీన భారత్ సంస్కృతి'

రేణిగుంట స్టేషన్ దగ్గర 'గుడిమల్లం' గ్రామములో క్రీ. పూ. 2 శతాబ్దినాటి ప్రాచీన శివాలయ మున్నది. ఇది సాతవాహనుల కాలమునాటిదని పరిశోధకుల అభిప్రాయము. దీనిని పరశురామేశ్వరాలయమని పిలిచెదరు. నిర్మాణము సామాన్యరీతిలో ఉన్నది. గుడిలోని శివలింగము విశిష్టమైనది లింగమునకు క్రింది భాగమున నడుమవరకు తీర్చబడిన మానవాకృతి, దాని భుజములపై ఒక మానవుని మోయుచున్నట్లు చెక్కబడియున్నది. ఇది శివ ప్రతీకలలో సాటిలేనిది. [22]

మన కింతవరకు తెలిసిన క్రీ. పూ. దేవాలయములు ఆంధ్ర దేశమున క్రీ పూ. మూడవ శతాబ్దిలో కట్టబడిన ఆలయాలు నాగార్జున కొండ త్రవ్వకాలలో బయలుపడినవి. అచట కనబడినట్టివి రెండు దీర్ఘ చతురస్రాలయములు పూర్తిగ శిథిలములై మాత్రము కనబడుచున్నవి. అక్కడక్కడ స్తంభములుండిన గుర్తులు కనబడుచున్నందున ఇవి స్తంభములపై నిర్మింపబడియుండునని ఊహించుచున్నారు ఇవి ఏ పద్ధతిలో నిర్మింపబడెనో, అందు ఏ మూర్తి ప్రతిష్ఠింపబడెనో చెప్పుట కష్టము. ఇక్ష్వాకులలో మూడవరాజైన 'ఎహువుల చాంత మూలుడు' 3వ శతాబ్దిలో కట్టించి శాసనము వేయించినాడు. ఈ దేవాలయములకు పూర్వభాగమున 'గజపృష్ఠాకృతి'లో 'పుష్పభద్రస్వామి ఆలయమును పై ఎహువుల చాంతమూలుడే కట్టించినాడు. దీని వైశాల్యము 30 × 20 అడుగులున్నది. చుట్టును ఇటుక గోడలు, వానిలో శిలాస్తంభములు కలవు. అంతర్భాగమున విగ్రహము నుంచు వేదిక. దానికి రెండువైపుల స్తంభశ్రేణి, వేదిక చుట్టును ప్రదక్షిణ పథము ఉన్నవి. ఆలయము బైట చతురస్ర ధ్వజ స్తంభవేదిక కలదు. దాని ప్రక్కన పడియున్న అష్టకోణ స్తంభ

---

22. తెలుగు విజ్ఞాన సర్వస్వము 3 సంపుటము శ్రీ సి. శివరామ మూర్తిగారి వ్యాసము.

ఖండము ధ్వజస్తంభము కానవచ్చును ఆలయము చుట్టు దీర్ఘచతురస్ర ప్రాకారము, దానికి అనేక ద్వారములు, పూర్వాభిముఖ ప్రధానద్వారము ఉన్నవి. ఇవిగాక చతురస్రకోణార్థ 'L' ఆకారము మరొక దేవాలయము పునాదులు కానవచ్చుచున్నవి. అంతర్భాగమున విగ్రహము లుంచు కొన్ని వేదిక లున్నవి. దీని నిర్మాణ రీతి విచిత్రముగ ఉన్నది.

గుంటూరు జిల్లా చేజెర్లలో ఒక శివాలయ మున్నది. దానిని కపోతేశ్వరాలయ మనుచున్నారు. ఇది గూడ 'గజపృష్ఠాకృతి' దేవాలయము. నాగార్జునకొండ పుష్పభద్రస్వామి ఆలయము వలెనే ఉన్నది. ఆలయము చుట్టు గోడలతో మూయబడి యున్నది. ఇట్టి బౌద్ధనిర్మాణములను 'చైత్యాలయము' లనెదరు. ఈ కపోతేశ్వరాలయమును 4వ శతాబ్దిలో ఆ ప్రాంతములను పాలించిన ఆనందగోత్రులైన రాజులు కట్టించిరి. ఇప్పుడు భారతదేశము నందు కానవచ్చుచున్న హైందవాలయములలో ఇది సుప్రసిద్ధమై ప్రథమగణ్యముగ ఉన్నది. తల విన్యాసము ననుసరించి పైనున్న విమానము వెనుకభాగమున గజపృష్ఠమువలె వంపుగా ఉంది. ముఖభాగము 'చైత్యగవాక్షము'వలె కమానుగ తీర్చబడియున్నది. ఈ పద్ధతిలోనే తరువాత మహాబలిపురములో పల్లవులు, అయిహోళెలో బాదామి చాళుక్యులు గజపృష్ఠాకృతి దేవాలయములను నిర్మించినారు.

**గుహాలయములు:-** ఆంధ్ర సాతవాహనుల గుహాలయ నిర్మాణము ననుసరించి తరువాతి 'వాకాటకులు', 'గుప్తవంశజులు', విష్ణుకుండినులు, బాదామిచాళుక్యులు, పల్లవులు గుహాలయము లను తొలిపించినారు. వారి నిర్మాణములలోని స్తంభ-చైత్యగవాక్షముల పోలికలవలన ఈ విషయము స్పష్టమగుచున్నది.

"కృష్ణానదీ లోయ భూములనుండి శాతవాహన-ఇక్ష్వాకు రాజుల శిల్పకళా ప్రభావము గుప్తరాజులకు, వారినుండి వాకాటకు

లకు సంక్రమించినట్లు అజంతా శిల్ప-చిత్రమూర్తుల వలన తెలియు చున్నది. అచటి నుండి బాదామి చాళుక్యులు గ్రహించిరి. వారిని పల్లవులు అనుసరించినారు. పల్లవులనుండి ఈ శిల్పరీతులు జావాకు తరలివెళ్ళినవి పల్లవ శిల్పముమీద విష్ణుకుండినుల ప్రభావము విశేష ముగా కానవచ్చుచున్నది" అని సుప్రసిద్ధ కళావేత్తలు, ప్రామాణిక పరిశోధకులు అయిన శ్రీ సి. శివరామమూర్తిగారు వ్రాసినారు.[23]

మన దేశమునందు క్రీ.శ. 5-6 శతాబ్దులలో కొండలను తొలచి నిర్మించిన గుహాలయములు వెలసినవి. శాతవాహనులనాటి గుహాలయ ములు వెలసినవి. శాతవాహనులనాటి గుహాలయ పద్ధతిలో హైందవ గుహాలయములను విష్ణుకుండిన రాజులు ప్రారంభించి ఆ వాస్తువును ప్రోత్సహించిరి. వీరి గుహాలయములు బెజవాడ, ఉండవెల్లి, మొగల్రాజపురములలో కానవచ్చుచున్నవి. ఇవి కొండచరియలను తొలచి నిర్మించినట్టివి వీనిలో ముందుభాగమున స్తంభములతో గూడిన వరాండిక, గోడలమీద-పార్శ్వముల చివరిభాగమున శిల్పము తోగూడిన మధ్యశాల, లోపలి గోడకు తొలువబడిన 3 గదులు, విష్ణుకుండినులనాటి గుహాలయ లక్షణములని చెప్పవచ్చును. ఈ నిర్మాణరీతి తక్కిన గుహాలయములకంటె సామాన్యముగ ఉన్నది.

మొగల్రాజపురములో అయిదు గుహాలయము లున్నవి. వానిలో త్రిమూర్తి గుహ, నటరాజ గుహలు రెండు మాత్రమే ముఖ్యమైనవి. ఇవి బెజవాడకు ఉత్తరమున నున్నవి. వీనిలో ముందు భాగమున రెండు స్తంభములు, వానికి రెండువైపుల రెండు కుడ్య స్తంభములు కలవు. మధ్య స్తంభములకు క్రిందిభాగమున, పైభాగ మున చదరముగఉండి మధ్యభాగమున అష్టకోణములు తీర్చబడినవి. స్తంభములపై పట్టెలు తీర్చిన బోధికలు, చివరఉన్న కుడ్య స్తంభముల ప్రక్కన శృంగమకుటములుగల రెండు ద్వారపాలక విగ్రహము

23. Erly Estern-chalukyan Sculpture.

లున్నవి. బోధికలపైనున్న ప్రస్తరము మీద చైత్యగవాక్షములు, వానిలో చెక్కబడిన శీర్షములు కానవచ్చును. లోపలి గోడలో తొలవబడిన 3 గదులలో ఎట్టి మూర్తులును లేవు. ఇందలి శిల్పరీతులు పల్లవ-బాదామి చాళుక్య దేవాలయములలో అనుసరింపబడినవి. దీనిని త్రిమూర్తి గుహ అనెదరు దీనికి సమీపమునందున్న నటరాజ గుహాలయము త్రిమూర్తి గుహాలయమువలెనే నిర్మింపబడినది. దీని ప్రస్తరమునకు పైభాగమున శిథిలమై కొంతభాగము కానవచ్చు నటరాజమూర్తి చెక్కబడినది. ఇందును లోభాగమున ఎట్టి మూర్తియు లేదు. ఆలయము బైటి ద్వారపాలకుని ప్రక్కనగల ఒక కోష్ఠములో గణపతి విగ్రహమున్నది లోపల స్తంభములు, శిల్పములు తీర్చబడినవి.

బెజవాడలో దుర్గకొండకు క్రిందిభాగమునగల గుహాలయము పూర్తిగ శిథిలమై పోయినది.

విజయవాడ దగ్గర కృష్ణానదికి ఆవైపున ఉండవల్లిలో గొప్ప గుహాలయము కలదు. దీనిపై మూడు అంతస్తు లున్నవి. ప్రతి అంతస్తునకు వెళ్ళుటకు సోపానము లున్నవి. ప్రతి అంతస్తులో చాల గదు లున్నవి. రెండవ అంతస్తులోని గుహాప్రవేశములను రక్షించు చున్నట్లు ఉన్న సింహములు చెక్కబడినవి. క్రింది భాగమున లావైన స్తంభములు పై అంతస్తులలో సన్నములైన స్తంభములు తొలచ బడినవి. రెండవ అంతస్తులో శేషశాయి విష్ణు విగ్రహ మున్నది.

వీని తర్వాత చెప్పతగినవి నెల్లూరు జిల్లాలోని భైరవకోన గుహాలయములు. వీనిని దక్షిణ తీరాంధ్రదేశమును పాలించుచుండిన పల్లవ సింహవిష్ణువు నిర్మించెను. అతడు విష్ణుకుండిన విక్రమేంద్రవర్మ అల్లుడు. విష్ణుకుండినులతో ఏర్పడిన బాంధవ్యము వలన వారి గుహాలయములచే ప్రభావితుడై సింహవిష్ణువు భైరవకొండ గుహాలను తొలిపించెను. ఇచట అనేక గుహాలయములున్నవి. ఇతని కుమారుడు

మొదటి మహేంద్రవర్మ ఒకేరీతిలో మహాబలిపురమున గుహాలయము లను తొలిపించి. గొప్ప శిలామూర్తులను చెక్కించినాడు. ఈవిధముగ విష్ణుకుండినుల వాస్తుకళ పల్లవులకు సంక్రమించి, వారి నిర్మాణము లకు మార్గదర్శకము అయినది.

## 2. చాళుక్య నిర్మాణములు

**చాళుక్య పద్ధతి :** శాతవాహన, ఇక్ష్వాకు రాజవంశీయుల నిర్మాణరీతులచే ప్రభావితులై, ఉత్తరభారతమున గుప్తసామ్రాట్టులు వైదిక మతోద్ధరణమునకు దేవాలయములు నిర్మించుచుండిరి. ఆ కాల ముననే అదే లక్ష్యముతో దక్షిణాపథమున వైదిక దేవాలయ నిర్మాణ ములు కొనసాగినవి. 5వ శతాబ్ది ఆరంభమున బిజాపురం జిల్లా 'అయి హోలు'లో రాజ్యపాలన ఆరంభించిన చాళుక్యులు, కంచి నేలుచున్న పల్లవులు హైందవ దేవాలయ నిర్మాణమునకు దీక్షాకంకణము పూనిరి, చాళుక్య నిర్మాణములు గుప్త సార్వభౌములను మించవలెనన్న స్పర్థతో సాగినట్లు కనబడుచున్నది. దీని నిర్మాణ పద్ధతిని "చాళుక్య వాస్తు పద్ధతి" అనెదరు. అంతకుముందు యిట్టి పద్ధతి లేదు. వైది కాలయములకు ప్రధానములయిన స్థలములలో "ఆయిహొళె" ఒకటి. ఇందు ప్రత్యేకస్థానము వహించిన చాళుక్య పద్ధతికి ఆరంభదశ కలదు. ఈ ఊరిలో 70 ఆలయము లున్నవి. వీనియందు ఈ పద్ధతిలోని క్రమ పరిణామ వికాసములను చూడవచ్చును. ఈ పద్ధతి భిన్నలక్షణములు గల ఉత్తర, దక్షిణ రీతుల సమ్మేళనముచే యేర్పడినది. [24]

చాళుక్య పద్ధతిని కొన్ని దశలుగా విభజింపవచ్చును :

1) మొదటిదశ - ఆలయములో గర్భగృహము ప్రత్యేక ముగా ఉండక వెనుకవైపు గోడతో కలసిఉండుట, పై కప్పు చదు నుగా కాని, వాలుగా కాని ఉండుట

---

24. Chalukyan Architecture — Henry Cousins.

2) రెండవ దశ - గర్భాలయము ప్రత్యేకముగా ఉండి దానిపై విమానము నిర్మింపబడుట.

3) మూడవ దశ—గర్భాలయము ముందు ముఖమంటపము లేక రంగ మంటపము, చుట్టును ప్రదక్షిణాపథము, నాలుగు వైపుల గోడలు, పూర్వాభిముఖ ద్వారము. దానిముందు అర్ధ మంటపము నిర్మించుట

విమాన పరిణామదశలో గదుల పై భాగమున చదును పై కప్పు ఉండి తరువాత కదంబరీతిలో క్రింద నుండి పై వరకు మెట్ల వరుసవలె మారి అనంతరము దుర్గాలియ విమానమువలె పూర్ణవికాస మునొంది శిఖర భాగమున పెద్ద ఆమలకము. దానిపైన కలశము అలంకరింపబడినట్లు తెలియుచున్నది ఆమలకము శిఖరభాగముననే గాక విమానమునకు నాలుగు మూలలలో క్రిందినుండి పై వరకు అక్కడక్కడ అమర్చబడినది. సాధారణముగ ఈ విమానములు విశాల మంటపముగల ఆలయములపైననే నిర్మించబడును. విమానమునకు ముందువైపున కీర్తిముఖమువంటి నిర్మాణము కల్పించబడి దానికి చక్కని ఆర్చిఅందులో నటరాజుగాని, ఏదైన దేవమూర్తి గాని ఉంచబడును. ఇది అంతరాళము పై కప్పుగా మారినవి. అయిహోళెలో చాళుక్య పద్ధతి ఆలయాలు, ద్రావిడ పద్ధతి ఆలయాలు నిర్మింపబడినవి.

ఇచటి ఆలయాలలో లాడ్ ఖాన్ దేవాలయము, దుర్గాలయము చెప్పదగినవి. మొదటి ఆలయముపై విమానములేదు. దుర్గాలయము బౌద్ధుల చైత్యగృహమువలె గజపృష్ఠాకృతిలో ఉండి పైన చాళుక్య పద్ధతి విమానము నిర్మింపబడినది.

చాళుక్యుల తరువాతి రాజధాని యగు బాదామిలో హైందవ గుహాలయములు, ద్రావిడ పద్ధతిలో నిర్మింపబడిన ఆలయాలు

ఉన్నవి అచటికి సమీపమునందున్న మహాకూటేశ్వరాలయము సామాన్యముగ ఉన్నను విమానము పరిపూర్ణతను చెంది శిఖరభాగమున అష్టకోణాకృతిగల ఒక అండము ఉంచబడినది. విమానమునకు చుట్టును కొన్ని వరుసలలో దేవాలయాకృతులు తీర్చిన శిలలు నిలుపబడినవి. ఇది ద్రావిడ పద్ధతికి ప్రారంభ పరిణామరూప మనదగియున్నది ఇచటి ఆలయాలలో మాలెగిత్తి శివాలయము అనంతర పరిణామమునకు నిదర్శనముగ ఉన్నది. గర్భాలయముపైన విమానము-ముందు విశాల మంటపము. ద్వారము ముందు ముఖమంటపము ఉన్నవి ఆలయము చతురస్ర తలవిన్యాసమున నిర్మింపబడినది. మంటప స్తంభములు చదరముగా, ఎత్తుగా ఉండి పై భాగమున బోధికలు వానికి "నాసికాప్రతిమలు" (*Brackets*) తీర్చబడినవి. బాదామి యందలి వాస్తువులో గుహాలయములు మొదటి పద్ధతిగను, సన్నగా మలచిన రాళ్ళతో గుడులు కట్టుట రెండవపద్ధతిగను కానవచ్చుచున్నది.

ఈ పద్ధతిలోని అనంతర పరిణామ దశ వారి మూడవ రాజధాని పట్టకల్లులో కానవచ్చుచున్నది. ఇచట 7వ శతాబ్ది ఉత్తరార్థములో నిర్మాణములు కొనసాగినవి. రెండవ పులకేశి తరువాత చాళుక్య సామ్రాజ్యమును విస్తరింప జేసిన విజయాదిత్య రెండవ విక్రమాదిత్యులకు పట్టణకల్లు రాజధానిగ ఉన్నందున ఇచట ఆలయవాస్తువు మహోత్కృష్టస్థితికి వచ్చినట్లు కనబడుచున్నది. ఇచట నాగర - ద్రావిడ పద్ధతుల మేళనముచే ఏర్పడిన చాళుక్యవాస్తు పద్ధతి ఆలయాలు, కేవల ద్రావిడ పద్ధతి ఆలయాలు కట్టబడినవి. వీనిలో పాపనాథాలయము ప్రాచీనమైనది. దీనిలో పాతక్రొత్తల మేలికలమిక కానవచ్చును. ఇచటి విరూపాక్షాలయము శుద్ధద్రావిడ పద్ధతి ఆలయము, సర్వాంగ శోభితముగా ఉన్నది. అప్పటి చాళుక్య రాజులు కంచి నాక్రమించినపుడు పల్లవ శిల్పులను గొనివచ్చి

వారిచే ఈ నిర్మాణము చేయించిఉండురు. ఇమ్మడి విక్రమాదిత్యుని భార్య 'లోకమహాదేవి' విరూపాక్షాలయమును కట్టించినది. ఇది చక్కని తల విన్యాసము, ఉత్తమ నిర్మాణవిధానము, సముచిత శిల్పవిన్యాసములు కలిగి పరిపూర్ణ వికాసమునకు నిదర్శనముగ ఉన్నది.

ప్రాచీన చాళుక్య రాజధానులన్నియు బీజాపురం జిల్లాలో ఉండుటవలన ఈ వాస్తుపద్ధతికి ఆ ప్రాంతములు మూలములైనవి. వారి రాజ్యవిస్తరణముతో ఆ పద్ధతి ఇతర ప్రాంతములకును ప్రాకినది [25] ఆ పద్ధతిలోని అనంతర పరిణామములు అలంపూరులో చూడవచ్చును. మన దేశమునందు ఈ వాస్తు పద్ధతికిచెందిన ఆలయాలు మహబూబ్ నగర మండలములోని అలంపూరు, కూడ అసంగమేశ్వరములలోను, కర్నూలు జిల్లాలో పాణ్యాం-మహానంది, సత్యవోలు మొదలైన చోట్లను కానవచ్చు చున్నవి. వీనిలో అలంపూరు ఆలయాలు సర్వతోముఖ వికాసము నొందినట్టివి.

**బాదామి చాళుక్యాలయములు:-** మహబూబ్ నగర మండలములో తుంగభద్రాతీరమునందున్న అలంపురము 'దక్షిణకాశి'గా పురాణ ప్రసిద్ధిగాంచినది. ఇచట రెండవపులకేశి కాలమునుండి ఆలయ నిర్మాణము కొనసాగినట్లు ఈ ప్రాంతాలలో లభించిన తామ్రశిలా శాసనముల వలన తెలియుచున్నది. ఇచట నవబ్రహ్మేశ్వరాలయములున్నవి. 'పూర్వమీ క్షేత్రమున బ్రహ్మదేవుడు తపస్సుచేసి శివలింగమును ప్రతిష్ఠించెనని, అందువలన ఆ లింగము బ్రహ్మేశ్వరుడను పేరు పొందెనని' స్థలపురాణము చెప్పుచున్నది. ఈ ఆలయము లన్నియు పూర్వాభిముఖములుగ, దీర్ఘచతురస్రాకృతిలో నిర్మించబడియున్నవి.

వీని తలవిన్యాసము దీర్ఘచతురస్రము. క్రింది భాగమున 3-4. ఎత్తుగల ఉపపీఠములు వానిపై ఆలయ నిర్మాణము సాగినది. అందు

25. 'Indian Archeteture' Percy Brown.

గర్భాలయము, అంతరాళము, రంగమంటపము, చుట్టు ప్రదక్షిణ పథము, దానిచుట్టును నాలుగువైపుల మూయబడిన మంటపము, ప్రవేశద్వారము - కొన్నిటికి ముఖమంటపము, గర్భగృహముపైన విమానము. శిఖరభాగమున ఆమలకము అంతరాళముమీద కీర్తిముఖమువంటి నిర్మాణము రచింపబడినది. ప్రధానాలయమునకు మాత్రము ముఖమంటపము ముందు నందిమంటపము, దానివెనుక బలిపీఠము. ఆ వెనుక ధ్వజస్తంభవేదిక, నిర్మింపబడినది. గోడల వెలుపలిభాగమున పైవరుసలో దేవగణమిథునములో మధ్యభాగమున మానవమిథునములు, దేవకోష్ఠపంజరములు, క్షుద్రపంజరములు, క్రింది భాగమున వికృత దానవముఖములు తీర్చబడినవి. ఆలయములన్నియు ఎర్రని ఇసుకరాతితో కట్టబడినవి. ద్వారబంధములకు ఇరువైపుల ద్వారపాలురు, వారిప్రక్కన గంగాయమునామూర్తులు. చెక్కబడినవి. గర్భాలయము ముందుండు రంగమంటపము పైకప్పునకు పద్మము, నాగబంధము, నటరాజు చెక్కబడినారు. గోడలమీద-దేవకోష్ఠములలో అష్టదిక్పాలకులు చిత్రాలంకరణ శిల్పము. పంచతంత్ర గాథలు, పురాణగాథలు తీర్చబడినవి.

గరుడ-స్వర్గ-కుమార - బాలబ్రహ్మేశ్వరాలయములకు ఎత్తయిన ముఖ మంటపములున్నవి. ప్రధానాలయమునకు మాత్రము అంతఃప్రదక్షిణ పథము, బహిఃప్రదక్షిణ పథము. దానిచుట్టు 3 అడుగుల ఎత్తయిన పిట్టగోడ-స్తంభమంటపము నిర్మించబడినది. అచటికి పదిమైళ్ళలో కూడలి సంగమేశ్వరమునందును అదే పద్ధతిలో ఆలయము నిర్మింపబడినది.

**పూర్వ చాళుక్యాలయములు:-** రెండవపులకేశి 7 శతాబ్దిలో కళింగమువరకు గల భూభాగములను జయించి తీరాంధ్ర భూమిని పాలించుటకై తన తమ్ముని కుబ్జ విష్ణువర్ధనుని ప్రతినిధిగా నిలిపెను. అన్న మరణించిన తరువాత అతడు స్వతంత్రుడై తూర్పు చాళుక్య

లకు మూలపురుషు డయ్యెను. ఈ వంశీయులు 7 నుండి 12 శతాబ్ది వరకు వేంగీ రాజ్యమును పాలించిరి ఈ సుదీర్ఘకాలములో వీరు తమ ప్రాంతములో చాల దేవాలయములు కట్టించి, విద్యాపీఠములు నెలకొల్పి వైదికధర్మమును పోషించిరి.

తూర్పు చాళుక్యుల నుండి గ్రహింపబడి స్థానిక రీతుల కనుగుణ్యముగా అభివృద్ధి చెందినట్టిది. దీనిపై శాతవాహనుల, ద్రావిడుల వాస్తుశిల్ప ప్రభావము చాల కలదు.

మొదటివాడైన కుబ్జ విష్ణువర్ధనుని కాలపు నిర్మాణములు విజయవాడలో కానవచ్చినవి. అక్కడి జమ్మిదొడ్డిలోని మంటప స్తంభములు అప్పటి అవశేషములు. వీని మీద బాదామి చాళుక్య శైలిచ్ఛాయలు కానవచ్చును. ఆ తరువాత పేర్కొనదగినవి దాక్షారామ, భీమవరములలోని భీమేశ్వరాలయములు. వీనిలో ఉన్న స్తంభములపై తీర్చబడిన నర్తకీ ప్రతిమలు, సురసుందరీ ప్రతిమలు బాదామి ఆలయాలలో ఉన్న వానినె పోలియున్నవి. పశ్చిమగోదావరి జిల్లా-బిక్కవోలులో వీరి ముఖ్యాలయములు కలవు. వానివలన పూర్వ చాళుక్య నిర్మాణశైలి తెలియగలదు. వీరి నిర్మాణములు ద్రావిడ పద్ధతిలో ఉండుట గమనింపదగియున్నది. పైనుండు 'విమానములు' పట్టదకల్లు-ఎల్లోరా, కాంచీపుర నిర్మాణములలో కానవచ్చు వానినే పోలిఉన్నవి. వీనిలో బాదామి చాళుక్య-పల్లవ వాస్తురీతుల ప్రభావము స్పష్టముగా కనబడును.

ఇక్కడి ఆలయములలో ఒకటి జినాలయము. గ్రామముదగ్గరి మరొక ఆలయము పూర్తిగా శిథిలావస్థలో ఉన్నది ఇందు శిల్ప సంపద చాల కలదు. ఆలయకుడ్యమునకు మకరతోరణము తీర్చబడిన కోష్ఠములు, వానిలో దేవమూర్తులు, విమానము పై వరుసలలో అనేక ప్రతిమారూపములు, మిథునములు, తీర్చబడినవి. ద్వారబంధ

ములకు గంగా యమునలు చెక్కబడినవి. సప్త రాజుల నిర్మాణలలో ద్వారములకు గంగా యమున లుండుట పరిపాటి. వారినుండి బాదామి చాళుక్యులు గ్రహించిరి. వారినుండి రాష్ట్రకూటులకు సంక్రమించినవి. పూర్వ చాళుక్యుడగు గణగవిజయాదిత్యుడు రాష్ట్రకూటుల నోడించి వారినుండి గంగా యమునా చిహ్నములను లాగుకొనెను. వానిని తాను కట్టించిన బిక్కవోలు ఆలయాలలో ప్రవేశపెట్టినాడు. మకరతోరణాలంకృతమైన కోష్ఠపంజరములు కంచిలోని కైలాస నాథాలయమునందును కనబడుచున్నవి.

ఇవిగాక బిక్కవోలు గ్రామములో మూడు శివాలయము లున్నవి. నాటిలో గోలింగేశ్వరాలయము శిల్పపూర్ణమైనది. పూర్వ చాళుక్యులలో ఇమ్మడి విజయాదిక్యుడు పరాక్రమశాలి. అతడు 12 సంవత్సరాలు శత్రువులతో 108 సంగ్రామములు చేసి విజయము గాంచెను. తన విజయచిహ్నములుగ అనేక రణక్షేత్రములలో 108 శివాలయములను కట్టించెను. ఈ వంశజుల అలయాలలో గుంటూరు జిల్లాలోని మాడుగులలోను, కృష్ణాజిల్లాలో విజయవాడలోను, పశ్చిమగోదావరి జిల్లాలో భీమవరం, దాక్షారామములలోను ఉన్నట్టివి వాస్తుకళాదృష్టిలో ఉత్తమమైనవి. [26]

కర్నూలు జిల్లాలోని వెదుర్తిలోలు, నివృత్తి సంగమేశ్వరము నందును వీరు సుందర దేవహార్మ్యములను నిర్మించినారు. వీనిలో సంగమేశ్వరాలయులు పేర్కొనదగినవి. ఈ ఆలయ నిర్మాణ రీతి విశిష్టమైనది. సంగమేశ్వర గ్రామములో ఉన్న రూవుల సంగ మేశ్వరాలయ భుజంగేశ్వరరాయములు వాస్తుశిల్ప కళాదృష్టిలో ఉత్కృష్టమైనవి. ఈ ఆలయాలను రాష్ట్రకూటులు నిర్మించిరని డా॥ రాజేంద్రప్రసాద్‌గారి అభిప్రాయము.[27] ఇవి వేంగిచాళుక్య నిర్మాణము

26. 'Erly Estern chalukyan Archeterture' – C. Srirama Murthy
27. 'Artibus–Asiae' (New yeek University) Vol–XXXIV.

అని శ్రీ K. V. సౌందరరాజన్‌గారు తెలిపినారు. [28] ఇదియే సరియైనది.

**రూపుల సంగమేశ్వరాలయము:-** దీని తల విన్యాసము అచ్చముగ వేములవాడలోని భీమేశ్వరాలయ విన్యాసమును పోలిఉండుట విచిత్రము. ఆలయము ముందుభాగమున ముఖమంటపము. దాని రెండుప్రక్కల సోపానములున్నవి. దాని తరువాత మూత గల మహామంటపము, అంతరాళము, గర్భగృహము క్రమముగా నిర్మింపబడినవి. మహామంటప కుడ్యములకు మధ్యభాగమున అర్ధమంటపములున్నవి. ఇట్టివి అలంపూరులోని ఆలయయాలలో కానవచ్చును. వీని క్రింది భాగమున రెండుచివరలలో సింహములు, నడుమ రెండు కుబ్జమూర్తులు మంటపమును మోయుచున్నట్లున్నవి. గోడలమీద బోధికలుగల అర్ధస్తంభములును కలవు ఇవి పట్టదకల్లు విరూపాక్షాలయములోను, సత్యవోలు భీమలింగేశ్వరాలయములోను తీర్చబడినవి. అక్కడక్కడ దేవకోష్టములు; వానిలో దేవమూర్తులు, పైన మకరతోరణాలంకారములు, పత్రతోరణములు, జాలకములు పైభాగమున అభిముఖములుగఉన్న ఖేచరమిధునములు చెక్కబడినవి. తూర్పున ప్రవేశద్వారమునకు రెండుప్రక్కల గంగాయమునలు. గోడలపైనుండు ప్రస్తరములకు హంసమాలికలు కలవు.

ఆలయము పైభాగమున 'ద్వితల' (రెండు అంతస్తుల) విమానము, దాని అగ్రభాగమున చతురస్ర శిఖరముగల స్తూపి ఉన్నవి. మంటపములో పైకప్పునకు పద్మశిలలు కలవు. అన్ని విధముల ఇదే నిర్మాణరీతిలో చిన్నగుడి భుజంగేశ్వరాలయము కట్టబడినది.

**కల్యాణి చాళుక్యాలయములు:-** బాదామి శాఖకు చెందిన కల్యాణి చాళుక్యులు 10 శతాబ్ది నుండి 12 శతాబ్ది వరకు కర్నాట

---

28. 'Erly Temple Archetecture in Karnataka and its-Ramifictions'.

కమును, పశ్చిమాంధ్రమును పాలించిరి వీరి నిర్మాణరీతి మారినది. వీరి ఆలయాలు తెలంగాణములోను. రాయలసీమలోను కానవచ్చుచున్నవి. కల్యాణి చాళుక్య నిర్మాణముల 'తల విన్యాసము-నిర్మాణ రీతి, విమాన రచనలలో చాల మార్పులు కలిగినవి. వీరి నిర్మాణములను, ఏకకూట, యుగళ, త్రికూట, చతుష్కూటాలయములుగా విభాగింపవచ్చును.

**ఏక కూటాలయములు**:-ఇవి మూడు విధములుగ కానవచ్చుచున్నవి.

1) చతురస్రముగ ఉండు గర్భగృహము. దాని ద్వారము ముందు వరాండావంటి అంతరాళము ఉండును.

2) గర్భగృహము, అంతరాళము, మహామంటపము, ప్రవేశద్వారము, ముఖమంటపము ఉండును.

3) గర్భగృహము, అంతరాళము, స్తంభమంటపము, చుట్టు పిట్టగోడ, మూడువైపుల అర్ధ మంటపములు, ప్రవేశమునకు మూడు సోపాన మార్గములు ఉండును.

**యుగళాలయములు**:- మహామంటపము, దానికి రెండువైపుల చిన్న గర్భాలయ-అంతరాళములు, ప్రక్కన ప్రవేశమునకు సోపానము లుండును.

**త్రికూటాలయములు**:- ఇవి రెండు విధములు కానవచ్చుచున్నవి.

1) మధ్యభాగమున రంగమంటపము, దానికి మూడువైపుల మూడు గర్భాలయ అంతరాళములు నాలుగవ ప్రక్కన ప్రవేశద్వారముగాని, సోపానములుగాని ఉండును.

2) త్రికదేవాలయము-చతురస్ర మహామండపము, దానికి చుట్టుగోడలు ముందుభాగమున ప్రవేశ ద్వారము, వెనుకగోడకు వరుసగా మూడు చిన్న గుడులు అంతరాళములు లేకుండ ఉండును.

చతుష్కూటాలయములు :- పై త్రికూటాలయములకే ముందు భాగమున వాహన మందిరము నిర్మింపబడి దానిముందు ఉభయపార్శ్వములలో ప్రవేశ మార్గము లుండును.

వీనిలో కొన్నిటికి నిర్మాణరీతి సామాన్యముగా ఉండును గోడలపై ఎట్టి శిల్పము వుండదు. పైనుండు విమానము కదంబ శైలిలో మెట్ల వరుసలు క్రింద పెద్దవిగ పైకి పోను పోను చిన్నవిగ అమర్చబడి అగ్రభాగమున చతురస్ర శిఖరము తీర్చబడును. ద్వార బంధమునకు చాల తీర్పు లుండును. ద్వారపాలురు గంగా యము నలు ద్వారమున కిరువైపుల చెక్కబడును. పై అడ్డకమ్మికి మధ్య భాగమున గజలక్ష్మి, రెండువైపుల సూర్య చంద్ర విగ్రహములు ఉండును. మంటప స్తంభములు, పై కప్పు బండలు, ద్వారబంధ ములు, విమానములు, సుందరశిల్ప విరాజితములై ఉండును.

పైన వివరించిన వీరి వివిధాలయములు మన దేశమున చాల చోట్ల ఉన్నవి. వీనిలో కొన్ని ముఖ్యాలయములు క్రింది స్థలములలో కలవు.

1) ఏకకూటాలయలు :- నందికంది—మెదక్ జిల్లా. ఇచ్చట కళ్యాణ చాళుక్యవంశజుడైన అయిదవ విక్రమాది త్యుని కాలపు రామేశ్వరాలయము ఈ వర్గ మునకు చెందిన ఆలయాలలో విశిష్టమైనది.

నక్షత్రాకృతిలో గర్భాలయము, దానిముందు అంతరాళము నవరంగ మంటపము, మూడువైపుల అర్ధ మంటపములు, సోపాన మార్గములు రచింపబడినవి. ద్వారబంధము దాని కిరువైపుల ద్వార పాలురు, మంటప మధ్యమున నుండు నాలుగు స్తంభములపై వేద మూర్తులు సుందరముగ చెక్కబడినవి. శిల్పకళాదృష్టితో ఇది చాల ముఖ్యమైనది.

(2) గంగాపురము—(మహబూబ్‌నగరం జిల్లా)

ఇచట కేశవస్వామి ఆలయము గూడ ఈ పద్ధతిలో నిర్మింప బడినది.

(3) అలంపూరు—(మహబూబ్‌నగర జిల్లా)

బ్రహ్మేశ్వరాలయ ఆవరణములోని ఆగ్నేశ్వర-విశ్వేశ్వ రాల యములు ఈ వర్గములో మొదటి విధమునకు చెందినట్టివి. వీనిద్వార బంధ రచన ప్రత్యేక విశిష్టమైనది. ద్వారబంధము నల్లరాతితో చెక్క బడినది. ఇరుపార్శ్వములలో పైభాగమున సూర్య-చంద్రమూర్తులు, నడుమ గజలక్ష్మి. దానిపై కపోత ప్రస్తరము ఆపైన కూట-శాలా విమానాకృతులు, క్రింది భాగమున ద్వారపాలకులు, గంగాయము నలు తీర్చబడినవి. ద్వారము ముందు నేలకు శంఖపద్మలతా శిల్పము చెక్కబడినది. మెట్లు వరుసగల విమానము, చతురస్రాకార శిఖరము, దానిపై నల్లరాతి కలశము, అందులో నారికేళము తీర్చబడినవి. ఇట్లే నల్లగొండ జిల్లా కొలనుపాకలోని వీరనారాయణాలయము, కరీం నగరం జిల్లా వేములవాడలోని భీమేశ్వర-కేదారేశ్వరాలయములు, కర్నూలు జిల్లా నివృత్తి సంగమములోని సంగమేశ్వరాలయము ఏక కూటాలయములలో గణనీయమైనవి.

## ౨. యుగళ దేవాలయములు

(1) మల్లేశ్వరము - (మహబూబ్‌నగరం జిల్లా)

ఇచటి అగస్త్యేశ్వరాలయ నిర్మాణకీర్తి గమనింపదగియున్నది. మధ్యభాగమున నవరంగ మంటపము, దానికి రెండుప్రక్కల గర్భాలయములు మంటపము చుట్టును ఎత్తయిన అధిష్ఠానము తీర్చబడిన పిట్టగోడ, దాని వెలుపలి భాగమున క్రిందినుండి పైవరకు అనేక శిల్పశ్రేణులు, ద్వారబంధములు, స్తంభములు మనోహరముగ తీర్చబడినవి పిట్టగోడకులోపైపున కక్ష్యాసనము లమర్చబడినవి.

(2) అలంపూరు - (మహబూబ్‌నగరం జిల్లా)

ఇచటికి 1 మైలు దూరమునగల పాపవినాశ తీర్థమునందలి దేవాలయ సమూహములో యుగళాలయము దర్శనీయమైనది. మధ్యమంటపమునందలి నాల్గు స్తంభములు నల్లరాతివి. వీనిపై రామాయణ గాథలు, క్షీరసాగరమథనము, శివలీలలు చెక్కబడినవి - పైకప్పులకు నవావతారములు (కలికి లేకుండా) మధ్యభాగమున బుద్ధమూర్తి చెక్కబడినవి. అష్టదిక్పాలకులు, నడుమ నటరాజమూర్తి తీర్చబడినవి. రెండువైపుల గల గర్భాలయములు, అంతరాళములు, ద్వారబంధములు చాళుక్యవాస్తు లక్షణములతో నిర్మించబడినవి.

(3) త్రికూటాలయములు-

నల్లగొండ జిల్లా - పానగల్లులోని ఛాయా సోమేశ్వరాలయము, మహబూబ్‌నగరం జిల్లా - జటప్రోలులోని మల్లికార్జునాలయము, అలంపూరులోని పాపనాశేశ్వర దేవాలయములు చెప్పదగినవి.

త్రిక దేవాలయములు:- అలంపూరులోని సూర్యనారాయణ స్వామి దేవాలయము, యోగనరసింహాలయములు. వరుసగా మూడు గదులుండు త్రికదేవాలయములలో గణ్యమైనవి. ఈ ఆలయములలోనెటి మంటప స్తంభములు, పైకప్పులు, ద్వారబంధములు, దివ్యశిల్ప విరాజితములై ఉన్నవి.

(4) చతుష్కూటాలయములు—

నల్లగొండ జిల్లా పచ్చల సోమేశ్వరాలయము, మహబూబ్ నగర మండలము అలంపూరులోని పాపవినాశతీర్థాలయము నిదర్శనములుగ ఉన్నవి.

(5) గజ పృష్ఠాకృతి దేవాలయము - వైదిక యజ్ఞశాలలో ఉండు దక్షిణాగ్నికుండమువలె అర్ధవృత్తాకారమున నిర్మింపబడిన దేవాలయము అలంపూరులోని పాపవినాశతీర్థమునందు కలదు. 4 శతాబ్ది తరువాత ఈ వృత్తాయత నిర్మాణము ఇచటనే కానవచ్చుచుండుట విచిత్రము. వివిధ వాస్తు రీతులకుచెందిన ఆలయాలు పాపవినాశతీర్థమున నిర్మింపబడి యుండుట ఆ స్థల ప్రాధాన్యమునకు నిదర్శనము.[29]

**రాష్ట్రకూటాలయములు :-** 8 శతాబ్దిలో రాష్ట్రకూటుల సార్వభౌమాధికారము విజృంభించినది. వీరు మాన్యఖేటము రాజధానిగా కన్నడ దేశమును పాలించిరి. వీరికి తెలంగానా, రాయలసీమ ప్రాంతాలుగూడ లోబడియుండినవి. వీరు తూర్పు చాళుక్యులతోను, పల్లవ-చోళ వంశీయులతోను నిరంతర యుద్ధములు సాగించుచుండిరి. వాస్తు శిల్ప కళాభివృద్ధికి వీరు చాల కృషి చేసినారు. వీరి హైందవాలయములు అలంపూరులోను, కర్నూలు జిల్లాయందలి ఉల్చాల, బండమీది తాండ్రపాడు మొదలైన ప్రదేశములలోను కానవచ్చుచున్నవి. కన్నడ దేశములోని వీరి నిర్మాణావశేషములకు, మన దేశమునందలి నిర్మాణములకు చక్కని పోలికలున్నవి.

**అలంపూరులోని మహాద్వారము:-**8 శతాబ్దిలో రాష్ట్రకూట ధారావర్ష ధ్రువ మహారాజ సేనాపతి బలవర్మ ఆంధ్రప్రాంతములను జయించి అలంపుర క్షేత్రమునకు వచ్చి బాదామి చాళుక్యులు

29. 'Temples in Telingana'. Dr. M. Radhakrishnasarma.

కట్టించిన నవబ్రహ్మేశ్వరాలయములకు మహాద్వారమును కట్టించి నాడు. ఇది అధిష్ఠానముపై నిర్మింపబడినది. పైభాగమున గోపురము లేదు. గోడలమీద ఎట్టి శిల్పములేదు, త్రోవకు రెండువైపుల రెండు అంతస్తులలో ద్వారమంటపము లున్నవి. పైకప్పునకు-చతుర్ముఖ బ్రహ్మ, అంధకాసుర సంహారక శివమూర్తి, శేషసహిత విష్ణుమూర్తి తీర్చబడినారు. దక్షిణమువైపు మంటపము క్రిందభాగములో చిన్న శివాలయ మున్నది. రాష్ట్రకూటులు బాదామి చాళుక్యులనుండి, పల్లవులనుండి ఆలయ నిర్మాతరీతులను గ్రహించినారు.

**కాకతీయాలయములు:-** కాకతీయులు రాష్ట్రకూట వంశమునకు చెందినవారు. వీరు కల్యాణి చాళుక్యులకు సామంత మండలేశ్వరులుగా ఉండి రెండవ ప్రోలరాజు కాలమున స్వాతంత్ర్యమును ప్రకటించిరి. 12 శతాబ్ది నుండి 14 శతాబ్ది వరకు సార్వభౌములై హానుమకొండ-వరంగల్లు పురములు రాజధానులుగా సకలాంధ్ర దేశమును పాలించినారు. వీరి నిర్మాణములు మనదేశమున అన్ని భాగములలో ఉన్నవి. ముఖ్యముగ తెలంగాణమున చాల కనబడుచున్నవి. కాకతీయులు చిరకాలము చాళుక్యసామంతులుగా ఉండినందున వారి నిర్మాణరీతులను గ్రహించి తమ ప్రత్యేకతను చాటుచు వాస్తు శిల్పకళా పోషకులైనారు. మైసూరు ప్రాంతములోని హొయిసల శిల్పరీతికిని, కాకతీయ పద్ధతికిని చాళుక్య నిర్మాణ శిల్పమే మాతృక.

మనదేశమునందు 9 శతాబ్ది వరకు దేవాలయ నిర్మాణములకు, అర్చామూర్తులకు ఎర్రఇసుకరాతినే ఉపయోగించుచుండిరి. 10 శతాబ్దినుండి నల్లరాయి ప్రాధాన్యము వహించినది. కల్యాణిచాళుక్యులు, వారి సామంతులు, నల్లరాతినే తమ నిర్మాణ-శిల్పములకు గ్రహించి మనోహర కళాకృతులను వెలయించినారు. కాకతీయ నిర్మాణములలోని తలవిన్యాసములు, నిర్మాణరీతి, స్తంభరచన, వాని

పైభాగమున నాసికాప్రతిమలు, జాలకములతోగూడిన ద్వారబంధములు, మంటపములు, ప్రస్తరములు, (దూలములు) వితానములు, (పైకప్పులు) విమానములు, దేవమూర్తులు, అలంకరణ శిల్పము మొదలైనవి చాళుక్య పద్ధతికి అనుసరణములే అయినను ఇవి కొన్ని స్థలములలో వానిని మించునట్లు ప్రశస్తతరములై, భవ్యశిల్పకళా సంశోభితములై యున్నవి. ఆలయములు ఎత్తయిన ఉపపీఠముల మీద, నక్షత్రాకృతిలో, చతురస్ర, దీర్ఘచతురస్రాకృతులలో నిర్మింపబడినవి. వీరు వాడిన నల్లరాయి చాల గట్టితనము గలది ఇది భూగర్భమునుండి తీసినపుడు మెత్తగనుండి వాతావరణ ప్రభావమునకు గట్టిపడును. అందువలననే ఈ రాతిలో చాల సున్నితమైన చెక్కడపు పని చేయుట సాధ్యమైనది. తరువాత శతాబ్దులు గడచినను చెక్కు చెదరక నిలిచియున్నవి,

కాకతీయ రీతిలో కొన్ని లక్షణములుండును. తలవిన్యాసము ననుసరించి అందమైన ఉపపీఠము, దానిమీద మధ్యభాగమున ఆలయము నిర్మాణము జరుగును. గుడిచుట్టును ఉండు ఉపపీఠభాగము ప్రదక్షిణా పథముగ ఉపయోగమగును. గర్భాలయ కుడ్యములు ఎత్తయిన అధిష్ఠానముపై ఉండును గోడలమీద అర్ధస్తంభములు గాని, దేవకోష్ఠములు గాని తీర్చబడును. పైభాగముగ ప్రస్తరములు, తల విన్యాసరేఖలలో అంతస్తులను పైవరకు తీసికొనిపోయి ముగించునట్లుండు విమానము, దానిపై శిఖరము రచింపబడును. గర్భాలయము ముందు అంతరాళము, విశాల స్తంభమంటపము, దానికి మూడువైపుల అర్ధమంటపములు, వానిముందు సోపానశ్రేణి నిర్మింపబడును. సోపానములకు రెండుప్రక్కల తొండము క్రిందికి చుట్టుకొన్నట్లుండు ఏనుగులు కాని, యాళి-సింహ రూపములు గాని తీర్చబడును. మంటపమునకు చుట్టును ఎత్తయిన అధిష్ఠానముగల పిట్టగోడలు కట్టి వాటి వెలుపలి భాగమునకు వరుసలుగా వివిధ జంతు

పక్షి మానవ ప్రతిమా శిల్పమాలికలు తీర్చి లోపలివైపున ప్రేక్షకులు కూర్చుండుటకు కక్ష్యాసనములు నిర్మించబడును. మంటప స్తంభములు చక్కగా నునుపు చేయబడి వివిధ శిల్పచిత్రాలంకృతములై ఉండును. పైభాగమున దూలములను తాకుచుండునట్లు సుందర నర్తకి ప్రతిమలు చెక్కిన నాసికలు అమర్చబడును. పైనవేయబడిన వితానములు సంపూర్ణ శిల్పమండితములై యుండును. కొన్నిటి పైకప్పులకు కమల గర్భాదిశిల్పము లోతుగా చెక్కబడి వివిధ విన్యాసములతో అలరారుచుండును. బహుశాఖా విలసితములైన ద్వారబంధములు మనోహర శిల్పాలంకృతములై యుండును. వీరి నిర్మాణములలో తోరణద్వారములు ప్రత్యేక విశిష్టమైనవి. కొన్ని ఆలయములలో ఆవరణమునందు చతుస్తంభ మంటపమును నిర్మించుట కలదు. కాకతీయ నిర్మాణములలో పాలంపేట-ఘనపురము లందలి ఏక కూటాలయములు, హనుమకొండ-నాగులపాడులలోని త్రికూటాలయములు మొదట చెప్పదగినవి. వీనిలో పై లక్షణములన్నియు కానవచ్చును. వీరి నిర్మాణములలో కొన్ని ముఖ్యాలయములు క్రింది స్థలములలో ఉన్నవి.[30]

ఏక కూటాలయములు:- నల్లగొండ జిల్లా పిల్లలమర్రిలోని శివాలయము, నాగులపాడు శివాలయము, వరంగల్లు జిల్లా పాలంపేట ఘనపురము శివాలయములు, ఖమ్మము జిల్లా కుసుమంచిలోని గోపాలస్వామి ఆలయము ఏక కూటాలయములలో గణ్యమైనట్టివి

యుగళాలయములు :- నల్లగొండ జిల్లా నాగులపాడులోని శివాలయము యుగళాలయములలో పేర్కొనదగినది.

త్రికూటాలయములు:- వరంగల్లు జిల్లా హనుమకొండలోని వెయ్యిస్తంభాల గుడి, నల్లగొండ జిల్లా పిల్లలమర్రి-నాగులపాడు

---

30. Temples in Telıngana.

లలోని శివాలయములు కరీంనగరం జిల్లాలోని నగునూరు శివాలయము, కూటాలయములలో చెప్పదగినవి.

త్రికదేవాలయము - ఖమ్మంజిల్లా కుసుమంచిలోని ముక్తేశ్వరాలయము త్రికదేవాలయము. దీనిలో వరుసగా మూడు గుడులు. వానిముందు మూయబడిన దీర్ఘచతురస్ర మహామంటపము, దానిలో మూడు ప్రవేశద్వారములు తీర్చబడినవి.

కాకతీయాలయములలో కొన్నిటికి విమానములు లేవు. చదునైన పైకప్పు మాత్రమే ఉన్నవి. ఆనాటి శిల్పులు మంటపములకే విశేష ప్రాధాన్య మొసగినట్లు కానవచ్చును. వారికి విమాన గోపురముల ప్రాముఖ్యము లేదు. తమ శిల్పకౌశల్యమును ప్రదర్శించి చెక్కడపు పనితో విశ్వమును విభ్రాంతము చేయుటే లక్ష్యమై ఉండెను.

విజయనగర నిర్మాణములు -14 శతాబ్దిలో విదేశీయ విమతీయ దురాక్రమణల వలన, అత్యాచారముల వలన భారతదేశమువందు వైదిక ధర్మమునకే తీవ్రాఘాతము కలిగినది. అప్పుడు దైవనియోగమున హిందూ ధర్మరక్షణమునకై విజయనగర సామ్రాజ్య మవతరించినది. అది అచిరకాలముననే ఉత్తరమున గోలకొండ, తూర్పున ఓఢ్ర దేశము, దక్షిణమున రామేశ్వరము, పశ్చిమమున గోవా ప్రాంతము హద్దులుగా విస్తరించినది. ఈ సువిశాల భూభాగములో విజయనగర రాజులు పరిపాలించుచు ధర్మరక్షణకై దివ్య దేవాయతనములు కట్టించినారు.

విజయనగర నిర్మాణరీతి ప్రారంభ కాలమున చాళుక్య పద్ధతిని అనుసరించినను రాను రాను, ఆంధ్ర-కర్ణాటక-ద్రవిడ దేశముల సంపర్కమువలన ఆయా ప్రాంతములలోని ప్రధాన వాస్తురీతుల నన్నిటిని జీర్ణము చేసికొని ఒక విలక్షణమైన విజయనగర పద్ధతిగా

రూపొందినది. దీనిలో మనకు అమరావతి-చాళుక్య-పల్లవ-చోళ వాస్తు రీతులును, విజాతీయమైన 'సార్సనిక్' పద్ధతికూడ గోచరించును. ఈ పద్ధతియందు కాలక్రమేణ గర్భాలయము, పైన విమానము, మూయబడిన అంతరాళ మంటపము, ముందురంగ మంటపము, చుట్టును విశాలప్రాంగణము. దృఢ ప్రాకారము, నాలుగు వైపుల మహాద్వారములు, వానిపై గాలిగోపురములు, ప్రాంగణములో పాకశాల, యాగశాల, భండారము, కల్యాణమంటపము, వాహనమండపము, పరివారదేవతలకు చిన్నచిన్న గుడులు. దేవపుష్కరిణి. ప్రాకారము చుట్టును లోభాగమునగాని, వెలుపలి భాగమున గాని, యాత్రికుల కొఱకు స్తంభశాలలు, నిర్మింపబడి దేవాలయము విస్తృతరూపము దాల్చినది. కృష్ణదేవరాయల కాలమున ఇంకను విస్తరించినది. దక్షిణ దేశమునందలి కంచి, శ్రీరంగము, మధుర, రామేశ్వరములలోని దేవాలయములు ఒక్కొక్కటి ఒక్కొక్క మహాపట్టణమువలె ఉన్నవి. రానురాను సహస్ర స్తంభ మంటపములు, దుర్గమువంటి అనేక ప్రాకారములు. 190-200 అడుగుల ఎత్తుండు మహా గోపురములు, 15-20 ఎకరముల నేల నాక్రమించిన విశాలప్రాంగణములు, విశాలములైన కల్యాణమంటపములు నిర్మింపబడి విజయనగర వాస్తు పద్ధతి ప్రేక్షకులకు ఆశ్చర్యహర్షములను కలిగించుచున్నది. ఈ కాలమున వాస్తు-శిల్పకళలు సంపూర్ణవికాసము నొంది పరాకాష్ఠ స్థితిని పొందినవని చెప్పవచ్చును. కొందరు ఈ పద్ధతిలో ప్రత్యేకతలేదని, విశేష సాంకర్యము గలదని ఈసడింతురు అది సరికాదు ఇది సర్వతోముఖ వికాసమునకు నిదర్శనము

విజయనగర వాస్తు లక్షణములను గూర్చి ప్రసిద్ధ కళా విమర్శకులు ఇట్లు తెలిపినారు. ఈ పద్ధతిలో ముఖ్య లక్షణము అట్లుండును. కుడ్యములకు, స్తంభములకు తామరమొగ్గలు కల

ఆధారఫలకములు పూర్ణముగ కానవచ్చుట, ఒకే రాతి స్తంభమున మధ్యభాగమునందు కొన్ని చిన్న స్తంభములు చెక్కబడుట, మంటపముల పైకప్పుమట్టును స్తంభములపైన ప్రస్తరములకు కొంత ముందుకు సాగి కమానువలె వంగిన చూరులు శిలలతో తీర్చి క్రింది భాగమున కర్రమీద చెక్కునట్లు ముడతలు చెక్కుట, మంటపములో రెండు వరుసల స్తంభములకు అభిముఖములుగా వెనుక కాళ్ళపై నిలిచి ముంగాళ్ళతో పైకి లేచినట్లుండు సింహములనుగాను, యాళి రూపములను గాని చెక్కుట, ముఖ్యములైనవి ఈ స్తంభరచనలో 16 శతాబ్ది అంతమున కొంతపూర్ప్వ కలిగినది. వెనుక కాళ్ళపై నిలిచి ముంగాళ్ళతో లేచినట్లుండు గుఱ్ఱములు, వానిపై కూర్చున్న రౌతులు చెక్కబడినారు. క్రిందిభాగమున సైనికులును కానవచ్చెదరు. మధురా నిర్మాణములలో ఈ పద్ధతి కనబడుచున్నది. గర్భాలయము గోడలమీదను, ప్రాకార కుడ్యములమీదను రామాయణ, మహాభారత, భాగవత గాథలు, పాలకుల వినోద క్రీడా చర్యలు, చతురంగ బలములు తీర్చబడును. కుంభ పంజరములు, అర్ధ స్తంభములు చెక్కబడును.[31]

ఈ నిర్మాణములందు చాల ఎత్తయిన ప్రాకార ద్వారబంధములు ఉన్నతాధిష్ఠానములతో తీర్చబడి ఇరువైపుల గంగాయమునలు పైవరకు లతాలంకారములు చెక్కబడును. ప్రవేశ ద్వారము దాటి లోనికివెళ్ళగనే ధ్వజస్తంభవేదిక కానవచ్చును. కొన్నిటికి మహాద్వారము బైటగూడ ఎత్తయిన శిలాధ్వజస్తంభ ముండును. ధ్వజస్తంభ వేదిక తరువాత బలిపీఠము, వాహన మందిరము, విశాల స్తంభ మంటపాదులు నిర్మింపబడును. మంటపవితానములకు దశావతారములు, దిక్పాలకులు, కృష్ణలీలలు, చెక్కబడుటగాని, వర్ణచిత్రములు

31. 'History of Indian and Indonesian Art' By K. A. Cumaraswamy.

రచించుట గాని చేయబడుసు. తాడిపత్రి - లేపాక్షి మొదలైనచోట్ల నలఆలయములలో చిత్రలేఖనములు కానవచ్చు చున్నవి. ఈ లక్షణ ములతో గూడిన దేవాలయములు దక్షిణ భారతమునందంతటను కానవచ్చు చున్నవి. మనదేశము నందలి కొన్ని ముఖ్యస్థలను మాత్రము పేర్కొనుచున్నాము.

అనంతపురం జిల్లా-పెనుగొండలోని శివాలయము, కదిరిలోని లక్ష్మీనరసింహాలయము, లేపాక్షిలోని వీరభద్రాలయము, తాడిపత్రి లోని రామలింగేశ్వర-చింతల రాయస్వామి ఆలయములు,

కర్నూలు జిల్లా-శ్రీశైలక్షేత్రములోని మల్లికార్జునస్వామి. ప్రాకార మంటపాదులు, గోరంట్ల మాధవస్వామి ఆలయము, మార్కాపురములోని చెన్నకేశవాలయములు.

కడప జిల్లా—అనిమెలలోని సంగమేశ్వరాలయము

చిత్తూరు జిల్లా—తిరుపతిలోని గోవిందరాజాలయము, తిరుమల లోని మంటప-ప్రాకారములు, సోంపల్లిలోని ఆలయాలు.

మహబూబ్ నగరంజిల్లా - జటప్రోలు - మంచాలకట్టలలోని గోపాలస్వామి ఆలయాలు.

నిజామాబాద్ జిల్లా-దిటిపల్లిలోని శిథిలాలయము.

కృష్ణాజిల్లా - ఆకిరిపల్లిలోని శోభనాచలస్వామి ఆలయము- ఇది పంచకూటాలయము.

విశాఖపట్టణము జిల్లా - సింహాచలములోని నరసింహాలయము మొదలైనవి కొన్ని మాత్రమే సూచింపబడినవి. విజయనగర పద్ధతి లోని నిర్మాణలక్షణమునకు లక్ష్యములనదగియున్నవి హంపిలోని విజయవిఠలల, హజారరామాలయ, విరూపాక్షాలయములని చెప్ప వచ్చును. మనదేశమునందలి ఆ పద్ధతి ఆలయాలు హంపి ఆలయము

లనే పోలియున్నవి. హంపిలోని శిలారథము తాడిపత్రిలోని చింతల వెంకటరమణస్వామి ఆలయములో చాల సుందరముగా చెక్కబడినది.

ఈకాలపు నిర్మాణములలో ముఖ్యముగ చెప్పదగినలక్షణము గాలిగోపురము. ఇది ప్రాకార ద్వారముపై నిర్మింపబడును. ఈ విధానమును విజయనగర శిల్పులు చోళులనుండి గ్రహించినారు. ద్వారభాగము శిలానిర్మితము. దానిపై 16 వరకు అంతస్తులు ఉండ వచ్చును ఈ పైభాగము నిర్మాణశైలీభేదములనుబట్టి 12 విధములుగ ఉండునని మానసార శిల్పశాస్త్రము చెప్పుచున్నది. ఈ పైభాగము ఇటుకలతో కట్టబడి పైనగచ్చుతో పూయబడును. ప్రతి అంతస్తునకు రెండు ద్వారములు ముందువెనుకలలో ఉండును ద్వారపాలురు మొదలైనరూపములు గచ్చుతోడనే చేయబడును. చివరి అంతస్తు పైకప్పు మీద 4-5 ధాతుకలశములు, వానికి రెండు చివరలలో గోశృంగాకృతి అలంకారము ఉండును. అందువలననే దానిని గోపుర మనెదరు. విజయనగరశిల్పులకు ముఖ్యదృష్టి మంటపనిర్మాణముననే ఉండినట్లుతోచును. మంటపస్తంభములపై గల చెక్కడపుపని అద్భుతమైనది.

తాడిప్రతి - దేవాలయములలోని గోడలమీద మనోహరముగ పురాణగాథలు తీర్చబడినవి. శ్రీశైల ప్రాకార కుడ్యములమీద పురాణగాథలు, రాజుల జీవనకథలు, చతురంగబలములు, క్రీడా విశేషములు, మృగయావినోదములు, దేవమూర్తులు సుందరముగా చెక్కబడినవి. తరువాతి నిర్మాణములందు జీవకళ కానరాక తేజో హీనములగుచువచ్చినవి

—:(౦):—

# ౬. ముస్లిం వాస్తుకళ

భరత ఖండమున ముస్లిములు స్థిరముగ నెలకొన్న తరువాత హిందూశిల్పుల సాయముతో మొదలు మొదలు మన దేవాలయ ఖండములనే ఉపయోగించి మసీదులు, సమాధులు, చావడులు మొదలైనవానిని నిర్మించికొనిరి. "ఈజిప్టు-స్పెయిన్ దేశములలోని ముస్లిముల "సార్సనిక్" రీతి ఇండియా - పర్షియా - మధ్యాసియా వాస్తుశిల్పముల అనుసరణమే అనియు, భారతీయులే వీరికి వాస్తుకళను నేర్పినారనియు ప్రసిద్ధ భారతీయ కళావేత్త "హావెల్" చెప్పినాడు.[32]

వీరి నిర్మాణములు ఉత్తర భారతమున చాల ఉన్నవి. మొగలుల కాలము ముస్లిం వాస్తుకళకు స్వర్ణయుగమని చెప్పవచ్చును. దక్షిణదేశమున గుల్బర్గా, బీదరు, బీజాపురము, గోల్కొండ ప్రాంతములలోని మసీదులు, గోరీలు కళానిలయములై ఉన్నవి.

ఈ నిర్మాణ లక్షణములలో స్తంభములకు తీర్చిన 'కమానులు, 'పైకప్పులుగా నిర్మించిన 'గుంబజులు', గోడలలోని చిన్నచిన్న 'గూళ్ళు', పైకప్పుమీద నలుమూలలలో నిలిపిన ఎత్తయిన 'మినారులు'; ముఖ్యమైనవని చెప్పవచ్చును. గచ్చుతో చేయుబడిన నున్నితమైన తాపీపని ఈ నిర్మాణములలో ప్రశస్తమైనది. మనదేశమున తెలంగాణా-రాయలసీమ ప్రాంతములలో ముస్లిం నిర్మాణములు చాల కానవచ్చుచున్నవి. గోలకొండ-హైదరాబాదులలో కుతుబ్షాహి నవాబులు కట్టించిన జుమ్మా మసీదు, చార్ మినార్, నవాబుల గోరీలు, రాజవీధులలో తీర్చబడిన కమానులు చెప్పదగినట్టివి. గోలకొండకోట ప్రాచీన నిర్మాణమే అయినను కుతుబ్షాహీల కాలమున దానిలో చేర్పులు, కూర్పులు జరిగినవి.

32 'Indian Archetecture'

16 శతాబ్ది చివరలోని మహమ్మదుకులీకుతుబ్షా కళాదృష్టిగల ఉత్తమపాలకుడు. ఇతని కాలమున హైదరాబాదు. పురాతననగరము నిర్మింపబడినది. ఈ నవాబు కాలమున చాల సుందరనగరములు వెలసినవి. సరస్సులు, తటాకములు త్రవ్వింపబడినవి. భవ్యప్రాసాదములు నిర్మింపబడినవి. ఇవి నేటికిని హైదరాబాదు పరిసరములలో దర్శనీయములై ఉన్నవి.

—:(o):—

# ౭. ఉపసంహారము

భారతీయ వాస్తుశిల్ప చరిత్రలో మన వాస్తువైభవము గణ్యమైనది. మనదేశము జనసమృద్ధి కలదై. తన ధార్మికతా రసికతల సమన్వముతో, వైభవముగ బ్రతికినట్టిది. ఈ విశాల భూభాగమున బౌద్ధులు, జైనులు, శైవులు, వైష్ణవులు మొదలైన విభిన్న మత సంప్రదాయకు లవారు సార్వజనిక విషయములలో ఏకాభిప్రాయులై ఒక వర్గమువలె జీవించినారు.

మన రాజులు, మహారాజులు పరాక్రమశాలురు, పరిపాలనా దక్షులు, కళాప్రియులు అయి తమ ప్రజలు సుఖశాంతులతో నోలలాడవలెనని పరిశ్రమించినారు. వారి గుణములన్నిటిలో ఉత్తమమైనది ధర్మశ్రద్ధ. దానికి ఔదార్యము ముఖ్యలక్షణముగా భావించిరి. అన్నిమతములను సమానముగ ఆదరించుటే వారి లక్ష్యము. వారి రాణులు, మంత్రులు, సేనాపతులు భిన్నమతములకు చెందినవారై యుండిరి. కాని వారు అన్ని మతముల ఆలయాలను సేవించి ధన్యులగుచుండరి.

నేటి మన ప్రభుత్వము శుద్ధ లౌకికమైనట్టిది. శుద్ధ లౌకిక మనగా మతవిరోధముకాదు. మతవిషయములలో ఉదాసీనము అసలే కాదు. మత పక్షపాతము లేకుండుటే దాని అర్థము. దేశప్రజలలో ఎన్నిమతములున్నవో అవన్నియు రాజ్యమతములే-రాజమతములే. రాజ్యపాలకుడు ఏదో ఒకమతము తనదిగా భావింపరాదు. అన్నిటిని సమానముగ పోషించుటే రాజధర్మము. ఈ తత్త్వమునకు దృష్టాంతమే ప్రాచీన రాజవంశజుల నానా ధర్మసంరక్షణము. అందువలననే మనదేశమున బౌద్ధ-జైన-వైదిక దేవాలయములు వెలసి. కళామయములై. ప్రాచీన వైభవమును చాటుచున్నవి.

ప్రాచీనకాలమున చిన్నవిగ ప్రారంభమైన మన ఆలయములు రాను రాను మహానిర్మాణములైనవి. భారతీయ సమాజముపై దేవాలయముల గంభీర ప్రభావము విశేషముగ కానవచ్చును. మన ఆలయములు బృహదాకృతి ధరించిన తరువాత బహువిధ కళాకౌశల్యమునకు అవకాశము లభించినది. వీనికి ఎందరో ఉదారులు పవిత్రదానములుచేసి ధనధాన్య సంపదలతో తులతూగజేసినారు. ఈ అపార సంపదను మన పూర్వులు భక్తిశ్రద్ధలతో రక్షించికొనుచు వచ్చినారు.

గొప్పదేవాలయముల నిర్మాణములందు ఎందరో ఉత్తమ కళాకారులకు గౌరవజీవనోపాధి కల్పించబడినది.

"ఎచట దేవాలయముఉండి శాస్త్రోక్తముగ పూజావిధులు జరుగుచుండునో ఆ ప్రదేశమునందలి జనులకు శాంతి, పరిపూర్ణతలు లభించి సకల చరాచరప్రాణికోటియందు భగవంతుని అస్తిత్వమును గ్రహించు వివేకము కలుగును అందువలన ఆలయమును కట్టించు ఉదారుడు భగవత్సేవపేరుతో జనతాసేవ చేయుచున్నాడు దేవాలయమునకు చేయు సర్వసేవలు సమాజమునకే చెందగలవు. దైవసేవ చేయువాడు భక్తునివలె, కింకరునివలె చేయును. అందు అహంభావ

మునకు అవకాశములేదు ఇదే భారతీయ సంస్కృతిలోని విశిష్ట లక్షణము.”[33]

‘ఒక దేశములోని కళాకృతులే ఆ దేశపు స్వీయ చరిత్ర’ అను లోకోక్తి కలదు ఏ జనులకు సంబంధించిన లలితకళలందు ఆ జనుల స్వభావములు, శక్తియుక్తులు వ్యక్తములగుచుండును. మన దేశమునందు జనుల అంతరంగ చరిత్ర మూర్తీభవించి నిలుచునది మన దేవాలయ శిల్పమునందే. ACC NO. 1115

‘ప్రాచీనరాజ్యములు నష్టమైనవి. రాజగృహములు నిర్మూల మైనవి. ధనికుల ప్రాసాదములు నిర్నామములైనవి. కోటలు కొత్తడములు నెలగూలినవి. కాని దేవాలయములు మాత్రము అన్య మతస్థుల అత్యాచారములకు గుఱి కానంతవరకు యథాతథములుగ మిగిలిఉన్నవి మన పూర్వులు శాశ్వతముగ ఉండవలసినది దేవాలయ మొకటే అని తెలిసికొనియుండిరి. వారికి సుఖమందు సుకృతమునకు, దుఃఖమందు ధైర్యమునకు ఆకరమై యుండినది దైవసన్నిధియే. అందువలననే వారి కళాప్రియ తరులతలన్నియు దేవాలయ చిత్రా లంకార శిల్పములందు కుసుమించి వికాసము నొందినవి. అట్టి కుసుమ ములచే చిరసౌరభభరితమైనది మన వాస్తుసంపద’



—:(o):—



33 ‘Temples in South India’ — P. R. Srinivasan.

# చిత్రములు